# శ్రీరామ కృష్ణ లీలాతరంగిణి



రచయిత

శ్రీ వెన్నెలగంటి లక్ష్మీనరసింహారావు

అశోక్‌నగర్ 1-10-142/A

హైదరాబాదు-500 020

ప్రచురణ

శ్రీ శివ గ్రంథమాల

శారదనగర్ — రోడ్ నెం. 75,

హైదరాబాదు-500267

అశోక్‌నగర్ 1-10-142/A

హైదరాబాదు-500 020

# విషయసూచిక

శ్రీ గురుదేవులు

# శ్రీ శ్రీ శ్రీ శిశుమహాస్వామివారు



## స మ ర్ప ణ

క॥ గురుదేవ ! శిశుస్వామీ పరమార్థప్రదము. నవ్యభావవిలాస!
స్ఫురితమ్మగు సత్కృతి సుస్థిరరీతిగ నంకితమ్ముజేసెద గొనుమీ॥

క॥ భావింపగ పూర్ణుండవు నీ వొక దివ్యావతార నిష్ఠుడవౌటన్ ।
నే, వేడి, రామకృష్ణ శ్రీవిభవ ప్రథిత కృతి రచించితిని గురూ! ॥

గీ॥ రామకృష్ణుల లీలాతరంగిణి యిది। నీ దయాప్తిని బలికితి మోదమంది।
స్వీకరింపుము గురుదేవ ప్రీతితోడ। తప్పులెన్నక మన్నించు దైవమీవ



# పండితాభిప్రాయములు

విద్యాలంకార, సాహిత్యరత్న, మహోపాధ్యాయ, శతావధాని.

గుంటూరు, 20-3-66

(పూర్ణప్రజ్ఞ గ్రంథమాలా సంస్థాపకులు)

శ్రీ హయగ్రీవాయనమః

శ్రీ వెన్నెలగంటి లక్ష్మీనరసింహారావుగారికి ఆశీరు భయకుశలోపరి

ఆర్యా! భవద్రచితమగు శ్రీ వేంకటేశ్వర సుమంగళ గీతమనెడు దివ్య సుప్రభాతమును బఠించి యానందించితిని. ఈ సుమంగళ గీతము నాలపించిన మీ కవితా కన్యయెంతయు ధన్యయని నా యాశయము, మీ సుకవితా కుమారికిది యేనా యభినందనము.

క॥ అలవేంకటేశ్వర సుమం
గళ గీతముపాడి నీదు కవిత చెవులలో
జిలికెన్ బూదేనియ సో
నలు వెన్నెలగంటి లక్ష్మి నరసింహ కవీ!

ఇట్లు
భవచ్ఛ్రేయోభిలాషి

శ్రీ హయగ్రీవాయ నమః

24-8-72

ఆశీర్వాణి–అభిప్రాయ (2)

శ్రీయుత వెన్నెలగంటి లక్ష్మీ నరసింహారావుగారికి ఆశీస్సులు.

# ఆశీస్సులు

ఆర్యా! తమ దండక పంచకమును భక్తి తత్పరులై చదువుచున్న తమ ముఖమునుంచి వినునప్పుడే నేను చాలా ముగ్ధుడనైతిని. తనువు పులకించినది. వేయేల మీ దండక పంచకము భక్తి రసమును వెల్లివిరియించు గేయమై శ్రోత ప్రేయమై భక్తజనోపాథేయమై మోక్ష పథపాథేయమై శ్రోతలను పాఠకులను దన్మయులఁజేయుచు స్వశ్రేయసమును గూర్పగలదని నాయాశయము.

ఉ॥ దండక పంచరత్నముల ధన్యుఁడు లక్ష్మినృసింహారావు ధీ
శౌండుఁడు వేంకటేశ పదసారస భృంగముమాలనల్లె, నా
దండ నెవండు కంఠమునఁదాల్చునొ!! యాతని చెంతకేగఁగా
దండధరుండు జంకు, బరదైవము శ్రీ హరివానిఁగా చెడున్

అగ్రహారము
గుంటూరు

ఇట్లు
బుధ విధేయుడు
కవిశేఖర మధ్వశ్రీ పళ్ళెపూర్ణ ప్రజ్ఞాచార్యులు,

24-8-73

# అభినందనము

శ్రీ మద్గురు భాగవత బ్రహ్మవిచారాత్మ విచారాద్యనేక గ్రంథకర్తలు.
శ్రీ వెన్నెలకంటి లక్ష్మీ నరసింహ కవిగారికి—
మిన్నికంటి గురునాథశర్మ వ్రాయునది—

కం॥ వెన్నెలకంటి కుల సము
త్పన్నుడు లక్ష్మీనృసింహవరనాముడు వ్యా
త్పన్నుడు శ్రీ రఘు చరిత్ర ప్ర
సన్నమతిని వినిచె సంతసంబును గంటిన్.

కం॥ మఱియును దండక పంచక
మఱిమిఱి విన్పించె ధారయద్భుతము సుమీ
హరిభక్తియు గురు భక్తియు
వరలిన సుకవీశ్వరులకు వంకలు గలవే?

గుంటూరు—2
5-7-73

చిత్తగించవలెను,
మిన్నికంటి గురునాథశర్మ

# అభిప్రాయములు

ఉభయ భాషాప్రవీణాది బిరుదాఢ్యులు
శ్రీ మిన్నికంటి గురునాథశర్మ
బ్రాడీపేట, ౫/౧౫, గుంటూరు-2

అన్ని విషయమ్ము లెఱిఁగిన
వన్నా ! యైనను రచనమునందు నవత్వం
బున్నది మృదురసమున్నది
వెన్నెలకంటి నరసింహా ! విద్వత్సింహా !
మున్నుగ భగవంతుని మది
సన్నుతి చేసితివి. పిదప సద్భక్తులచే
సన్నుతి చేయించెదు బళి !
వెన్నెలగంటి నరసింహా ! విద్వత్సింహా !
వర వెన్నెలగంటి కులా
భరణా లక్ష్మినృసింహ పండిత సుకవీ !
విరచన ముద్రణ మఖిలము
భరియించును హనుమయే కృపావశుఁడగుచున్ !

# శుభాకాంక్షలు

"కులపతి" శ్రీ కొంపల్లి ఆంజనేయశాస్త్రీ
*M. A., M. Ed.,*
విద్యాప్రవీణ, భాషాప్రవీణ, (హిందీ+తెలుగు)
ఆంధ్రోపన్యాసకులు,
8-4-50, శ్రీకృష్ణకాలనీ, స్టేషన్‌రోడ్,
వరంగల్లు-2

సౌమనస్యముచే సారస్వత సేవా సముల్లాసులు, స్వయంకృషిచే సరస్వతీ సేవలో పారంగతులు, సరసహృదయులైన విజ్ఞులు, శ్రీ శివ అవధూత స్వామి వారి కృపాకటాక్షముచే తమకుగల భక్తిభావనను ప్రపంచములో వ్యాప్తి చేయుచున్న శ్రీ వెన్నెలగంటి లక్ష్మీనరసింహారావుగారు ఆదర్శజీవనులు, అనుభవజ్ఞులు.

అట్టి శ్రీ వెన్నెలకంటి లక్ష్మీనరసింహారావుగారు తమ జీవితమును రామార్పణముగ జేసుకొనుటకై "శ్రీరామ తత్త్వము" ను ప్రజలకు తెలుపుటకై శ్రీ రామావతార-రామా తారక మరియు కృష్ణావతార మహిమల గ్రహించి ''శ్రీరామ కృష్ణ లీలా తరంగిణి'' అను పుస్తకమును రచించిరి.

''నీ మహిమను బాడుచుండె నిఖిల ఖగమ్ముల్'' అను ''సుమంగళ గీతిక''తో నారంభించి, ''నీ సేవయె మా లక్ష్యము" నీ సేవయె మాకభయము- నీ సేవయె మాకు రక్ష నీరజనేత్రా "అను భక్తిప్రపత్తిని భక్తులకు సూచన''గ తెలిపిరి.

''సర్వోపనిషత్సారము," ''సర్వశాస్త్ర సముల్లసితము," ''సమస్త విశ్వ సూచకము" అగు భగవత్స్వరూపమై, ''నాదబిందు'' స్వరూపమై, ''బాహ్య ప్రపంచమునకును - ఈశ్వరునకును నడుమనిలిచి'' యున్న ఓంకారమును వీరు స్మరించుచు భక్త మహాశయులను స్మరించునట్లు సూచించుటకై ''ఓంకార మహిమ''ను నిలిపిరి.

విశ్వము సమగ్రమై ప్రత్యేకమైనపుడు ''నామ-రూప భావములతో'' వెలయును.




''నామ పునశ్చరణమొనరించుటకు స్థల – కాలములు'' గాని, సమయ - నియమములుగాని లేవు. అట్టి ''బ్రహ్మజ్ఞాన'' మున పరాకాష్ఠనంది యమరత్వమును పొందుటకై ప్రణవమును స్మరించుటచే కాలక్రమమున నట్టి ''ఓం''కార నామము ''అవిచ్ఛిన్నమగు తైలధారవలె - సుదీర్ఘమగు ఘంటానాదము'' వలె మనోగోచరమగును. అట్టి ''ఓం''కార నాదోపాసనచే సమస్త శతక్రతు ఫలితములు లభించును. అట్టి ''ఓంకారమహిమ'' తెలుపుటకై (19) పందొమ్మిది యర్థములను శ్రీ వెన్నెలకంటివారు చూచి భక్తులకు వివరించిరి.

''సర్వప్రకాశకుడు – అఖండమైన ఏకరూపియైన'' భగవంతుడు ''ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః జ్ఞాన వైరాగ్య యోశ్చైవ'' అనునట్లుండువాడు. అట్టి పరమేశ్వరుడు ''శ్వేతాశ్వతరోపనిషత్తు''లో తెలిపినట్లు (''ఏకోదేవః సర్వభూతేషుగూఢః..... నిర్గుణశ్చ'') సర్వవ్యాపి, సర్వభూతాంతరాత్మ యైనవాడు. అట్టి పరమేశ్వరుడు ధర్మమునకు గ్లాని జరిగినపుడు లోక సంరక్షణార్థమై అవతారములను చూపును. అట్టి అవతారములలో దుష్టశిక్షణ – శిష్టరక్షణలే కర్తవ్యములుగ నుండును. మానవయత్నమేగాక ధర్మ సంస్థాపనలో భగవదవతార మహిమ'' యొక్క ప్రాశస్త్యమీ పుస్తకమున వివరింపబడినవి.

''యుగములు–మహాయుగములలో'' పరమేశ్వరుని లీలలను గుర్తించి, పరమేశ్వరార్పణముగ చేయు ప్రయత్నరూప ''మంత్రపుష్పము'' ఈ పుస్తకము.

ఈ పుస్తక మందలి భక్తిభావ సౌరభవము భక్తజనుల హృదయామోదకమే శ్రీ వెన్నెలకంటి లక్ష్మీనరసింహారావు గారిచే॥ వెన్నముద్దల కృష్ణుడు-శ్రీ రఘుచరితము భ్రమరాంబ మల్లికార్జున సుప్రభాత దండకము వంటి మరికొన్ని కృతులను పరమేశ్వరుడు రచింపజేయుకాక అనునది నా యాకాంక్ష.

# ఆహ్లాదము !

'సాహిత్య విద్యా ప్రవీణ'
దీవి శ్రీనివాస దీక్షితులు,
సంస్కృతోపన్యాసకులు
ఎస్. కె. ఆర్. బి. ఆర్. కళాశాల,
నరసరావుపేట, 522 601.

పరిధులులేని ప్రజ్ఞానము పరిభాసించుట ప్రాజ్ఞులకు ప్రమోదకర విషయము! పరిధులు పదలిన పరిజ్ఞానము మాత్రము పామరులకు ప్రస్తుతి పాత్రము! సృష్టిలోని ప్రతి వస్తువునకు పరిధి ప్రకల్ప్యము కాదు-ప్రకృతి 'సిద్ధము! సీమోల్లంఘన' మనునది అజ్ఞాని చిత్త ప్రసృత తమో వీచిక! భౌతికదృష్టి సుస్థిరతకు మరు మరీచిక!

ఈ 'అజనాభము' (భరతఖండమునకు పూర్వనామము) అనాది కాలము నుండియు ఐహికాముష్మికముల పంటలతో కలకలలాడిన కమనీయ కేదారము- పావనోదార పయఃపూరము లెన్నియో ప్రవహించిన కర్మభూమి.

'అత్ర జనసహస్రాణాం సహస్రైరపి సత్తమ!
కదాచిల్లభతే జన్తుర్మానుష్యం పుణ్య సంచయాత్॥

(విష్ణు పురాణము, 2-3-23)

పురాకృత పుణ్య విశేషము ననుసరించి ఎన్ని వేల జన్మలకో కాని ఆ పుణ్యభూమిలో జన్మ లభించదు. కాని నేడీ 'ఆధ్యాత్మిక జన్మభూమి' సృష్టితత్వ రహస్యమును గ్రహించలేని - అజ్ఞానచ్ఛటా సంచారమును నిరోధించలేని-నమ్మ చేయదని ఇహమునే నమ్మి అంతులేని ఆశావలయముల సాలెగూళ్ళలో చిక్కుకొని అసంతృప్తి-నిరాశలతో యాన్త్రిక జీవనాధారమును వదలి క్షణకాల మయినను బ్రతుకలేని బడుగువారుగా మారిన 'భౌతిక వాదులకు' నివాస భూమి శోచనీయము!

ఇట్టి దుస్థితిలో కొట్టుమిట్టాడుచున్న జీవచ్ఛవముగా పరిణతి చెందిన జాతికి అచ్చొటచ్చటను భర్మాభిరాములు మోక్షైకగాములు ఊతకఱ్ఱలుగానున్న 'శ్రీరామ కృష్ణ లీలా తరంగిణి'ని పైనుండి వీచు మందమారుతములు మానసిక ప్రశాంత స్థితిని కల్పించగలవని నమ్ముట నేరము కాదు గదా! ఈ 'తరంగిణి'ని ఆంధ్ర దేశమున ప్రవహింపజేసిన అభినవ భగీరథులు 'భక్తకవిశేఖర' శ్రీ వెన్నెలగంటి లక్ష్మీనరసింహారావు గారు పేరెన్నిక గన్న ఆధ్యాత్మిక ప్రవృత్తి! అరవిరిసిన మల్లె పువ్వుల స్వచ్ఛతా - సుగంధము కలయికచే సర్వుల నానందమున ముంచెత్తు మృదుమధుర మానసము వీరికి 'పరమాత్మ' ప్రసాదించిన వరము, వీరి అకుంఠిత గ్రంథరచనా ప్రచురణ దీక్ష పుణ్యసంపాదన కార్యమునకు అవికలమగు 'శ్రీరామ రక్ష'! 1966 వ సంవత్సరమునందు 'శ్రీ శిశుకుమార గురు' ప్రసాదలబ్ధకవితా కంఠముతో 'శ్రీవేంకటేశ్వర సుమంగళ గీతము'ను గానముజేసిన పిదప 1966వ 'హాయనము' నుండియు ఏడాదికొకటిగా తొమ్మిది కృతి సోపానముల నధిరోహించి నేటికి శ్రీరామకృష్ణ లీలాతరంగిణి యందదుగిడిరి, ప్రమోదము।

ఈ 'శ్రీరామకృష్ణ లీలాతరంగిణి' గ్రంథమునకు 'ముఖబంధము'గ 'సుమంగళ గీతిక' ప్రథమ ముద్రణము 1966: ద్వితీయ ముద్రణము 1967ను ప్రచురించుట శోభాదాయకముగ నున్నది. వీరి కవిత కేవలము 'వ్యాకరణాలంకార ఛందశాస్త్రములకు' కట్టుపడునది కాదు. భక్తిప్రధానముగా ప్రసాద గుణముతో సాగు 'చల్లని సెలయేరు'–మంచు ముత్తియముల చేరు అంతియే కాదు–

poetry is vent for over charged feelings, అని ప్రవచించిన ప్రసిద్ధ పాశ్చాత్య విమర్శకుడు 'జాన్ కేబెల్ కవితా నిర్వచనమునకు (ఉప్పొంగి పోవు భావ ప్రవాహమునకు పరీవాహము కవిత్వము) సాక్షీభూతము వీరి కవిత్వము! భవతు!

మరి 'తరంగిణి' యొసుకుమార సుందర గద్యమునందు 'ద్వాదశ విభాగ షట్టముల' నేర్పరచుకొనుచు సాగిన నిశితభావ మధుర పయః పూరము ఇచ్చట 'ద్వాదశ విభాగములను' కల్పించుట శ్రీ వెన్నెలగంటి వారి వివేచనా శక్తికి మచ్చుతునక।

శ్రీకృష్ణతత్త్వైక మధుర ప్రమాణ భూతమగు శ్రీమద్భాగవతము 'ద్వాదశ స్కంధాత్మకము'! శ్రీశంకర భగవత్పాదుల పద్మ పాదాది శిష్యులతోకూడి సకల కలుష హరమగు కాశీపురమునందు వ్యాకరణ శాస్త్రికజీవి - మహోన్నత పురుషార్థ తత్త్వ విరహియగు ఒక విప్ర వరునకు వేదాంతసారమును ప్రబోధించుటకు 'శ్రీ గోవింద ద్వాదశ మంజరికా స్తోత్రము'ను ప్రవచించిరి. వారికి కూడా 'ద్వాదశ' సంఖ్యాప్రీతి కలుగుటకు హేతువు పరిశీలనైక వేద్యమే!

'సాధ్యా ద్వాదశ విఖ్యాతాః' (అమరకోశము) అనునది ఒక కారణము. 'సాధ్యన్తే ఆరాధ్యన్తే ఇతి సాధ్యాః' ఆరాధింపబడువారే సాధ్యులని ఒక పక్షము. 'సాధ్యం సిద్ధిరేషా మస్తీతివా, సిద్ధిగలవారే సాధ్యులనునది మరియొక పక్షము. విష్ణువు – ధర్ముడు - నారాయణుడు - మనుడు హనుమంతుడు మున్నగు పదునెనిమిదిమంది సాధ్యులు, రెండు పక్షముల ననుసరించియు 'నారాయణావతార తత్త్వము'ను పదునెనిమిది భాగములలో వివేచించుట సముచితమే!

ఈ గ్రంథకర్త 'శబ్దకల్పద్రుమ – శంకరభాష్య - ఉపనిషత్పురాణ భగవద్గీతాదులను సమ్యక్పరిశీలనము గావించినటుల ఈ తరంగిణియే సాక్ష్యము పలుకుచున్నది. తత్తద్విభాగము లందలి విషయములను నేనిచ్చట ఉల్లేఖించుట వ్యర్థము శైలి సులభము - మధురము కదా!

కావున ఇంతటితో నా 'ఆహ్లాదము'ను అణచుకొని గ్రంథ పఠనమునకు మీ కవకాశమును కల్పించుచు ఈ గ్రంథకర్త మున్ముందు కూడ తన 'దీక్ష'ను కొనసాగించ గలరని సంభావించుచున్నాను.

---

భక్తకవిరత్న,
"శైవశ్రీ"
పులిపాక చలపతిరావు బి.ఏ.

సంపాదకులు

శ్రీశైలప్రభ, శ్రీశైల దేవస్థానము–
శ్రీశైలము.

శ్రీ రామకృష్ణాద్యవతారములు; వారి లీలలు తెలియని వారుండరు. శ్రీ రామకృష్ణులు ఆదర్శపురుషులు. ఈ యవతార విశేషములను భాగవతాగ్రగణ్యుడు, సహజ పాండిత్యుడునయిన మహాకవి పోతనామాత్యుడు తన ఆంధ్ర మహాభాగవతమున వర్ణించునటుల మరే కవిపుంగవుడును వర్ణించియుండలేదు. మహాకవి పోతన్నకు ఈ యవతార చరిత్రములన్న ఎనలేని భక్తి, ప్రేమ తన్మయత్వమున వ్రాసిన ఈ రెండు చరిత్రములును శ్రీమదాంధ్ర మహాభాగవతమందు మణిపూసలుగా నాటికీ నేటికి మరియేనాటికయినను వెలుగొందుచుండును.

అట్టి శ్రీరామకృష్ణుల లీలలను శ్రీ వెన్నెలగంటివారు తమ సహజధోరణిలో శ్రీ రామకృష్ణ లీలాతరంగిణి యను పేర చిన్న గ్రంథమును వెలయించి ఆంధ్ర పాఠకలోకమునకు తమ శిశుగ్రంథమాలద్వారా అందించి ధన్యులయినారు. శ్రీ వెన్నెలగంటివారి రచనలు పాఠకలోకమునకు సుపరిచితములే ఐనను భగవల్లీలా వర్ణనములు చర్వితచరణములైనను అవి నిత్య పూతనములుగా ప్రభవిల్లుననుట నిర్వివాదాంశము.

ఈ చిన్నిగ్రంథమున శ్రీ లక్ష్మీనృసింహరాయ కవిగారు, సుమంగళ గీతికను, ఓంకారమహిమను, మంత్రపుష్పమును జేర్చి బంగారమునకు తావి యబ్బినటుల రచించిరి. ప్రతిదినమును పూర్ణపురుషులగు శ్రీ రామకృష్ణుల లీలలను పఠించి భక్తులెల్లరు మోక్షసామ్రాజ్యమందుటకు సుగమమైన మార్గమును నిర్మించు కొందురు గాతయని నా ఆకాంక్ష.

కవిత్వమును గురించి చెప్పవలసిన యావశ్యక మావంతయును లేదనియే నా అభిప్రాయము. ప్రతి పద్యమును నొకరసగుళికయే యన్న నత్యుక్తి కాదేమో!

వెన్నెలగంటి వారిట్టి గ్రంథముల నింకను రచియించి ఆంధ్రభక్తలోకమున మన్నన లందుగాక యని ఆ శ్రీరామ కృష్ణులనే ప్రార్థించుచున్నాను.

పోలూరి రామకృష్ణయ్య, యం.ఏ.
హిందీ శాఖ

## ఆ శీ స్సు

కం. శ్రీ విలసల్లగ నిరుపమ
భావముతో నీవు సుప్రభాతమ్మును, ల
క్ష్మీవిభుడైన తిరుమల
దేవునికి రచించి తీవు స్థిరతర భక్తిన్.

కం. శ్రీ వెన్నెలగంట్యన్వయ
నీవీ సత్కృతిని వేడ్క నిర్మల మతితో
భావించి తిరుమలేశుని
సేవదనర జేయవే, నృసింహ సునామా!

నర్సరావుపేట
7-3-66

శ్రీ మహా సరస్వత్యైనమః

"గురుదేవ"

శ్రీ వెన్నెలగంటి లక్ష్మి నరసింహారావు గారు "అచ్చమ్మపేట" నివాసులు-సిద్ధ
కూటగురు దంపతులసేవా దురంధరులగు అవదూత శ్రీ శివస్వామివారు అచ్చమ్మ

పేటకు వచ్చినపుడు శ్రీ స్వామి ముఖమున శ్రీ లక్ష్మీనరసింహారావు గారితో నాకు పరిచయ మేర్పడినది. శ్రీ శివస్వామివారి సేవాభాగ్యము మాకు లభించినది. స్వామివారి అనుగ్రహమువలన ఈ కవిగారు భక్తిభావ బంధురుడయి భగవదుపాసనానుసంధాన సమన్వయ సమ్యగనుభవ సంస్కార మనః పరిపూర్ణ రంజన ప్రదరస శబ్దసుమంబులతో సామాన్య పాఠకులకు సరళముగా నుండునట్లు ఈ గ్రంథమును (వైజయంతిని) రచించినారు.

నేటి కలియుగమున ఆబాలగోపాలము సేవలనందు కొనుచున్న శ్రీ తిరుపతి వేంకటేశ్వరునకు అలంకారముగా శోభిల్లుచూ స్వామివారి మెడయందు నిత్య నూతన కాంతి పుంజముల రంజింపజేయు శ్రీ వైజయంతిమాలను స్మరించి తదీయ వైభవ లీలా చిద్విలాస కళాకైంకర్య పారవశ్య కాంక్షా కుతూహలమున ఈ గ్రంధమునకు "శ్రీ వైజయంతి" అను నామ కరణ మొనర్చినారు. తన నిర్మల హృదయ కంజ వింజామరముతో పంచ భూతముల సంస్కారమునకు దండకపంచకమను నెపముతో వైజయంతి మాధారియగు శ్రీ లావేంకటేశ్వరస్వామివారికి మందమారుతమును ప్రసరింపజేయుచు భక్తితో చిత్తశుద్ధితో పలు విధములుగా పలికిమురిసినారు. గురుదేవుని ప్రీతికై ప్రతిదండకమునకు చివర భక్తి పూర్వకముగా దన సేవలను సమర్పణ చేసినారు శ్రీ లక్ష్మీనరసింహారావు గారు. ఈ నిస్వార్థభావములోనే భక్తుడుతనను తానెఱుగ లేడు. ప్రహ్లాదాది భక్తులును ఇటువంటి వారలే. ఎక్కడైనను నీవు విష్ణువును చూపగలవా? అని తండ్రియగు హిరణ్యకశిపుడు కొడుకును అడుగగా "ఎందెందు వెదకి చూచిన నందందేగలడు" అని నిర్భయమిగా స్వార్ధరహితముగా బలికిన బాలుని రక్షించుటకు ఆ నరసింహ మూర్తికి అంతటను నిండియుండవలసివచ్చె గదా ! దీనికి నిండిన భక్తియే కారణము అట్టి భక్తి ప్రేరణ ఈ కవి గారిని మేలుకొలుపుగా, సర్వజనానంద సాక్షాత్కారియగు వైజయంతీమాలను నిర్మల హృదయముతో కలిమాయా మాలిన్యమును దులుపుటకు గ్రంథనామము ను "వైజయంతి" అనిపేరు పెట్టినారు. ఇట్లు పెట్టుట ఎంతయు సమంచితము.

దండక పంచకములందు ప్రధానముగా శ్రీ వేంకటేశ్వరస్వామివారిని మిక్కిలి కొనియాడి వారి కరుణకు మిగిలిన నాలుగు దండకములను తగినంతగా చదువుటకు సులభముగా నుండునట్లు రచించినారు.

సాధనకు ఇవి సాధనములుగా నుండుటయేకాక సముచిత సమయ సమన్వయ స్వాంతులకు సాధనాభ్యున్నతికి చేయూత నొసంగలవని నా విశ్వాసము.

ఈ నరసింహారావు గారికి ఆ గురుదంపతుల కరుణా విశేషము లభించు గాతయని కాంక్షించుచూ నా హర్షమును ఇటుల తెలుపుచున్నాడను.

ఇట్లు
శ్రీ శివస్వామిచరణకమల సేవాదురంధరుడు,
పోలూరిరామకృష్ణయ్య, ఎమ్.ఎ.,
హిందీశాఖ

శ్రీ సుబ్బరాయనినారాయణ కళాశాల
నరసరావుపేట

నర్సరావుపేట
11-9-73

# గురుదేవ

## నామాట

భక్తాగ్రేసరులారా !

"శ్రీ రామకృష్ణ లీలాతరంగిణి" యను గ్రంథ రాజమును మా లక్ష్మీనర సింహారావుగారు రచించిరి.

కలికాలమున తరించుటకు మానవునకు "రామ" నామముగాని "కృష్ణ" నామముగాని సహకరించుటలో పెట్టినవె పేరు-

అట్టి "రామ-కృష్ణ" అవతారములగురించి ప్రజలకనుకూలముగా, సులభముగా నుండునటుల వీరు పరిశ్రమించిరి.

ఇక మనము గ్రహింపదగిన సమన్వయము

శ్రీ రామావతారము-అనుష్ఠానావతారము

శ్రీకృష్ణావతారము-ఉపదేశావతారము"

రామావతారమున తపస్సంపన్నత, తదేకాగ్రచిత్త వృత్తి తన్నిష్ఠాను భూతి విభూతులు గణనీయములు-శరభంగ మహర్షి శబరి మున్నగు వారలను తలంచుకొన వచ్చును.

విశ్వామిత్రుడు రాముని గురించి ఇట్లు చెప్పుచున్నాడు.

"రాచిరపుణ్యధామ! రఘురామ! వహింతునె యజ్ఞదీక్ష మౌనాచరణంబె

కాని. యిక నర్థముకాదు వచింపయేగతిన్ గాచెదవో కదా! మఖ మఖండ పరాక్రమమ ధూర్వ హోగ్ర మారీచ సుబాహు మాయలు తరించి భవద్భుజ శక్తి చూచెదన్-" ఇట్లు నోరూర రాముని తన పుత్రునిగా అజ్ఞాపించారు.

ఇప్పటికిని విశ్వామిత్రుడు రాముని మేల్కొల్పు సమయమున ప్రవచించిన వాక్యమును కౌసల్యా సుప్రజారామ!'' అనునది వేంకటేశ్వర సుప్రభాతమున మనము వినుచున్నాము. అది విశ్వామిత్ర మహర్షి వాక్సుధారసమేగా!

శ్రీకృష్ణావతారమున ఉపదేశ వాక్యములు మనము పలుచోట్ల గాంచగలము ముఖ్యముగా గీతోపదేశము అర్జునునకు ప్రబోధించుట తద్వారా మనము గీతను చదివి తరించుటకు కారణము నెఱుంగుచున్నాము.

గోపికలు-రాసక్రీడలు, శ్రుతిగీతలు మొదలగునవి.

అక్రూరుడు రథములోనున్న రామకృష్ణులను అర్ఘ్య మొనర్చునపుడు నదీ నీరములో దర్శనమొసంగుట చూచి ఆశ్చర్యముజెందినాడు.

''స్నానము సేసిచేసి, నది చల్లనినీరను రామకృష్ణులన్ మానుగజూచి, వీరు రథమధ్యమునన్ వసియించియున్నావారీనది నీరిలోపలికి నెప్పుడు వచ్చిరటంచు లేచి మే ధానిధిసూచె వారిని, దధస్థుల భక్త మనోరథస్థులన్'' ఈ విధముగా కృష్ణుడు ''నేనే భగవత్స్వరూపము''అని నిర్వచించి భక్తులకు అనేక విధములుగా సాక్షాత్కరించియున్నాడు.

ఇట్టి ''రామ-కృష్ణ'' అను పవిత్రనామముల నెంత తలచిన అంత సన్నిహితులమయి ఆ భగవత్కటాక్షమును మనము పొందగలుగుచున్నాము.

కలిదోషప్రశాంతికి-

హరే రామ! హరే రామ! రామ రామ హరే హరే!

హరే కృష్ణ! హరే కృష్ణ! కృష్ణ కృష్ణ! హరే హరే

ఈ విధముగా లక్ష్మీనరసింహారావుగారు భగవన్నామమును తలంచుచు గ్రంథరూపమున ప్రజలకందించి తరింపజేయుట. ఇది వారి జన్మమునకు చక్కని అవకాశము కలిగించుకొనిరని, ఈ కార్యనిమగ్నతచే వారికి శ్రీగిరి సిద్ధకూట గురుదంపతుల కరుణాకటాక్షము మిక్కిలిగా కలుగుచుండుగాతమని, వినయ పూర్వకముగ ఆ గురుదంపతులను వేడుకొనుచున్నాను.

పోలూరి రామకృష్ణయ్య, యం.ఎ.

శ్రీ చింతలపాటి నరసింహదీక్షిత శర్మ
గ్రేడు I తెలుగు పండితుడు

# ఆమోదము

శ్రీ దండక పంచక మిది
వేదండావను దయాప్తి విలసిల్లి సదా
కైదండ నొసఁగు భక్తికిఁ,
బూదండలు గూర్చు భక్తపుంజంబులకున్—

దండక పంచకంబు సముదాత్తత పదంబు, సుభక్తి సారముల్
పండిన పండతోటవలె భాసిలి, భక్తకవీంద్ర కోటికు
ద్దండ సుఖంబు గూరిచి సదా పరమేశ్వర సేవలో యశో
డిండిమ నాదసంపద ఘటించుత వెన్నెలగంటి యింటికిన్.

భక్తి యుక్తి కుంటుపడిన యీ కలియందుఁ
బంచ దండకములు పాడుకొలిపి
నవ్య భక్తిరీతి నాటి వెన్నెలగంటి
సుకవి—దివ్య యశము చూఱగొనియె—

సురుచిరము వేంకటేశ్వర సుప్రభాత
దండకమునందు స్వామి ప్రత్యక్షమగుచుఁ
బలుకు సొంపున భక్తిని బలుకరింపఁ
జేసె వెన్నెలగంటి నృసింహ బుధుడు,

పలురకంబుల నేవొ పలుకవచ్చునుగాని
సహజవైఖరి బల్కఁజాలుటరుదు
ఇచ్చకంబులనేవొ మెచ్చవచ్చునుగాని
కల సత్యము వచింపఁ గలుగుటరుదు
పై డంబముల నేవొ ప్రామ వచ్చునుగాని
తత్త్వంబు గుర్తించి తనరుటరుదు
పదవులకై పదఁబ వచ్చును గాని
కలదానితోఁ దృప్తిగనుట యరుదు

సహజవైఖరి, సత్యలక్షణము, తత్త్వ
చింతనము, నిత్యతృప్తిని, జెంది భక్తి
నంది- యాదర్శగృహమేధియై ప్రసిద్ధి
గాంచె, సరసుడు వెన్నెలగంటి బుధుడు

# సుధాస్రవంతి

"కవిరాజమౌళి"

చింతలపాటి నరసింహదీక్షిత శర్మ,

కోగంటిపాలెము-అగ్రహారము 31-10-78

శ్రీయుతులు భక్త కవిశేఖరులు వెన్నెలగంటి లక్ష్మీనరసింహారాయ మహోదయులు, తమకున్న సాహితీసౌహిత్యముతో నిత్యసంతుష్టాంతరంగులై పలుతెరంగుల దైవలీలా రంజితములగు కృతుల రచించి భక్తకోటికి అందించి తరింపజేయుచు వారు తరించుచున్నారు వారి కృషి కడుంగడు ప్రశంసార్హము ప్రస్తుత కృతి "శ్రీ రామకృష్ణ లీలాతరంగిణి" చక్కని పేరందుకొన్నది. ఇందు మాయామానుష లీలా మానుషస్వరూపులగు శ్రీరామ కృష్ణుల పురుషోత్తమతత్త్వము సముచితముగా వివరింపబడినది. తత్తదవసర విశేషములతో రచన సాగించి కావ్యమునకే సోయగమును జేకూర్చిన రావుగారు ధన్యులు-వీరుకూడ ధీరోదాత్తులు-రాముడు పూర్వభాషి-కృష్ణుడు స్మితపూర్వాభిభాషి-అనగా రాముడు ముందు చెప్పదగిన విషయము చెప్పి పిమ్మట చిఱునవ్వు వెన్నెల చిలుకరించును. కృష్ణుడు ముందుగానే మందహాసమరందముచింది తదుపరి పలుకులాడును. వీరి వ్యక్తిత్వములిందు మనకు వెల్లడియగుచున్నవి. మా నరసింహారావుగారియందు పై రెండు తత్వము లున్నవి, అందుకేకాబోలు "రామకృష్ణులు" వారిని బాగుగా ఆకర్షించినారు. యశోదయాలంకృత మూర్తులు రఘు యదూద్వహులు మా కవిగారికి నితోధిక భక్తిభావసంపత్తి-ఆర్థికస్థితిని వెలయించి తమ సేవ చేయించుకొందురుగాత-అని ఆకాంక్షించు మిత్రుడు.

# భక్తిస్వభావము

రాగం అంజనేయులు

స్థాపిత కార్యదర్శి

రామ నామ క్షేత్రము

గుంటూరు

మధురపదార్థమును ఒకేరే భుజించరావాని శాస్త్రము. తోటి వారి కందరికిని పంచవలయునని భావము.

ఈ శాస్త్ర నియమము శ్రీ వెన్నెలగంటి లక్ష్మీనరసింహారావు గారి ఆచరణ యందు స్పష్టమగుచున్నది. పరమ పవిత్రము శ్రీఘ్రఫల ప్రదము, మధురమునగు శ్రీ రామ, శ్రీకృష్ణ, ఇత్యాది భగవన్నామ సంస్మరణమువలన తాను ఆనందాను భూతి పొందుటయే కాక తోటి మానవునికి కూడ ఆ రుచిని చూపి వారిని తరింప చేసి తాముకూడ తరింపవలెను సదుద్దేశ్యముతో శ్రీ రామకృష్ణ లీలాతరింగిణి అను పవిత్ర గ్రంథమును రచనకు పూనుకొనిరి. ఇందు ముఖ్యముగా హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ కేవలం

"కలౌ కలౌ నాస్త్యేవ నాస్త్యేవ, నాస్త్యేవ్య గతిరన్యథా" అని కలి సంతోారపనిషత్తు, కలియుగ మానవులు సులభముగా తరించుటకు ప్రసాదించిన రామకృష్ణాది నామముల మహిమయు వారి అవతార విశేషములున్నూ. ఆవశ్యకతనూ నిత్యము అర్థము తెలియకుండ అందరు పఠించు మంత్రపుష్పముయొక్క భావమునూ, భక్తులెల్లరు సీతారాములు, లక్ష్మీనారాయణులు, రాధాకృష్ణులు, పార్వతీ పరమేశ్వరులు, తల్లిదండ్రులుగా భావించి యిరువురను పూజింపవలయు ననియు, అనేక అమూల్యములగు విషయములను భక్తులయిన వారికి అందించి తరింపచేయుటకు మార్గము చూపియున్నారు.

వీరికి వంశానుసరణి లభించిన కవిత్వమును సద్వినియోగపరచి తాము తరించి యితరులను తరింపజేయుచున్నారు.

ఈపవిత్ర హృదయులగు శ్రీ వెన్నెలకంటి లక్ష్మీనరసింహా రావుగారికి దీర్ఘ ఆయురారోగ్యములను ప్రసాదించి లోకకళ్యాణము చేకూర్చుగాకయని క్షేత్ర స్వామి యగు ఆ కోదండరామ స్వామి వారిని ప్రార్థించుచున్నాను.

---

భాషాప్రవీణ, పండిత కవి,
ప్రత్తిగొడుపు సత్యనారాయణరాజు
తెలుగు ప్రధానోపాధ్యాయులు
జిల్లాపరిషత్ హైస్కూలు,
మాచర్ల.

''ఈశ్వరానుగ్రహాదేవపుంసా మద్వైతవాసనా''
శ్రీ మదమాత్యాగ్రేసర !
శ్రీ వెన్నెలగంటి లక్ష్మీనరసింహారావుగారూ !

వెన్నెలగంటివారు విజ్ఞాననిలయులు.అట్టి వెన్నెలగంటివారి వంశంబునఁ బుట్టిరి. పూర్వులవలెనే వెన్నెలగంటివారి యందొకరుగా ప్రకాశించిరి.భక్తి తాత్పర్యముజేఁ బరిఢవిల్లితిరి అట్టి భక్తియే ''శ్రీ రామరక్ష - సర్వజగద్రక్ష'' ఇత్యాధికముగా గ్రంథరచనలఁగావించి వర్ధిల్లుదురుగాత !

కం॥ వెన్నెలగంటి జనించితి
''వెన్నెలగంటిని'' యనంగ వెలిగితిభక్తిన్
వెన్నెలగంటి నృసింహా !
వెన్నెలగంటివి గదయ్య ! వెన్నెలయయ్యా !

---

## రెంటాల శివరామయ్య

### ఆశీస్సు

క౦॥ శ్రీ వేంకటేశభక్తుడు
యీ వెన్నెలగంటి వంశపునరసింహా
రావోనరించిన స్తోత్రము
వేవిధముల హృద్యమంబు విమలం బరయన్.

ఇట్లు,
రెంటాల శివరామయ్య

చిగురుపాడు
11-3-66



గ్రంథకర్త:

శ్రీ వెన్నెలగంటి లక్ష్మీనరసింహారావు

వారి సతీమణి

శ్రీమతి వేంకటసీతారామమ్మ

# వంశావళి

పరమ తపో మహత్వముల పంటలు గంపల కెత్తినట్టియా
"హరిత మునీంద్రచంద్రుడు'' మహామహితాత్ముడు గోత్రకర్తయై
వరలఁ గడింపె సిద్ధమగువాసిని వెన్నెలగంటి వంశమీ
ధర నిజకీర్తి చంద్రికలుదార సుధారసముల్ వెలార్పఁగన్.

ఆ పవిత్రవంశమ్మున నవతరించి
రాణగాంచెను విష్ణుపురాణకర్త
"సూర్యనార్యుడు" సుకవితా సుందరుండు
మంజు మంజుల గుణపుంజ మందిరుండు.

పొడమెఁదదుపరి నా వంశముననే "లక్ష్మి
నరసు" పండితమౌళి, కైసరుడు. సుగుణి
అందెఁబండిత మాన్యమ్ములతడు మత్పి
తామహుండు సమగ్రయశోమహుండు.

''వేంకమాంబ'' దయార్ద్రి; సాధ్వీమతల్లి
యిల్లుదీర్పఁగ నా తాత యిద్ధతేజు
నా జనకు ''సుబ్బయాఖ్యు" విరాజమాన
దీవిభువుఁగనె గణిత విద్యావిలాస.

రామాతిలకము నా జన
నీమణి ''రామమ్మ'' కీర్తి నెలకొనఁజేయన్
నీమమ్మున నా జనకుఁడు
సోమునివలె నిత్యవృద్ధి శోభిలెధరణిన్.

ఆనయధన్యులందు దయమందిన పుత్రుఁడనేను నన్ను ల
క్ష్మీనరసింహు'' డందురు-రచించితిఁ గొన్నికృతుల్ గురూత్తమ
ధ్యానఫలానులబ్ధ కవితాగరిమన్, వృషశైలనాథ సే
వానుభవ ప్రబుద్ధహృదయము భక్తిలతల్ సుమింపఁగన్.

"సీతారామాభిధ" సం
ప్రీతిన్ గృహలక్ష్మి యగుచు శ్రీ వర వంశ
శ్రీ తనుకొ త్తింపcగ నీ
రీతిన్ గృహమేధి ధర్మరీతిన్ గొంటిన్.

ఋతువుల పోలిక నార్గురు
సుతులును, పుత్రిక యొకర్తు శోభను బెంపన్
సతతము భగవత్పదరతి
గతిcగాc దలపోసి, గూర్తుcగైతలతేనెల్.

మేలొసcగు ప్రాథమిక వి
ద్యాలయములయందు నొజ్జనై బాలురకున్
వీలయినంతగ—గఱపితి
నేలోపములేనిరీతి నే నక్షరముల్.

వదలితి నొజ్జరికము నీ
పదసేవా తత్పరత్వ భాసితమతినై
సదమల జీవిత నౌకను
కదలించుచు నుంటిని వాలుగాలిని దేవా!

తల్లి దండ్రుల గోల్పోయి తల్లడిల్లు
నన్ను పోషించివ్యక్తినొనర్చి మంచి
వెలుగుబాటలు గూర్చిన పెద్దతల్లి
మదినితురుమెళ్ల యీశ్వరమ్మను దలంతు.

ఇట్లు,
గ్రంథకర్త,
శ్రీ వెన్నెలగంటి లక్ష్మీనరసింహారావు

# కృతజ్ఞతా నివేదనము



ఓం శ్రీ శిశుకుమార మహాస్వామినే నమః

అస్మద్గురు దేవులగు పూజ్యశ్రీ శివమహాస్వామీజీ, శిశుకుమార మహాస్వామీజీ గాయత్రీ మహాస్వామీజీ సోమస్కంథభారతీ మహాస్వామీజీ, చతుర్వేది మహాస్వామీజీ, తత్త్వనిదానం మహాస్వామీజీ, మరైకండనంబి మహాస్వామీత్యాది చతుర్త్రింశతి నామవిభ్రాజితులైన శ్రీశ్రీశ్రీ అవధూత శివమహాస్వామివారి చరణ సరోజములకు భక్తి పురస్సరముగా నీ కృతిని సమర్పించు చున్నాను.

శ్రీ రామతీర్థ సేవాశ్రమవాస నివాసులు శ్రీశ్రీశ్రీ కేశవతీర్థస్వామి (పిడుగురాళ్ళ) వారును, శ్రీ చైతన్యకుటీర స్వర్గాశ్రమవాస నివాసులు శ్రీశ్రీశ్రీ నారాయణా

నందస్వామి వారియు, శ్రీ అష్టముఖ గండభేరండ లక్ష్మీనృసింహ త్రిజగద్గురు పీఠస్థాపకులు మరియు ధర్మకర్తలు శ్రీశ్రీశ్రీ జగద్గురు సత్యానందేంద్ర సరస్వతీ స్వామి (సింహపురి-మాడిపాడు - గుంటూరు జిల్లా) వారియు, శ్రీ శృంగేరీ శ్రీ విరూపాక్ష శ్రీ పీఠాధీశ్వరు జగద్గురు శ్రీ శ్రీ నృసింహానందభారతీమహాస్వామి వారియు, "విశ్వజనని'' శ్రీ జిల్లెళ్లమూడి అమ్మ వారియు, మాతృశ్రీ లక్ష్మీ నరసాంబ (ప్రకాశ్‌నగర్-నర్సరావుపేట) వారియు చరణ సరోజములకు భక్తి పురస్సరముగా నమోవాకము లర్పింతును.

సహృదయులకు సారస్వత రసికులకు భక్తులకు నమోవాకములు-శ్రీ గురు దేవు నాజ్ఞానుసారము, వారు చూపిన వెలుగులో నడచుచు నేను సారస్వత కృషి కొంతకొంత చేసి ఈ "శ్రీరామకృష్ణ లీలాతరంగణి" గుదిగూర్చితిని. దీనికితోడు ''సుమంగళిగీతిక'' ''శ్రీ వేంకటేశ్వర సుప్రభాతదండకము" (వైజయంతినుండి) ''ఓంకారమహిమ'', మంత్రపుష్పము-భావము'' "శ్రీ వేంకటేశ్వర కళ్యాణమంజరి", శ్రీ హనుమాన్ చత్వారింశత్పద్య రత్నమాల'', (శ్రీ తులసీదాసకృత శ్రీ హనుమాన్ చాలీసాకు తెలుగుసేత తులసీదళమునుండి) అనువానిని అనుసంధించి నాకు గల భక్తి భావనాలేశమును ద్వితీయ ముద్రణలో ప్రకటించితిని. దీని యందుగల మంచి మీకు మంచి కలిగించిన నేను ధన్యుడను. గుణదోష నిరూపణలో హంసప్రాయులయిన మీకు నేను వేరుగా జెప్పనవసరములేదు. ఈ గ్రంథమునకు వన్నెచిన్నెలు కల్పించిన శ్రీ జగద్గురు భాగవతాద్యనేక గ్రంథకర్తలు శ్రీ మిన్నికంటి గురునాథశర్మగారికిని, ఆంధ్రోపన్యాసకులు, విద్యాప్రవీణ, భాషాప్రవీణ (హిందీ-తెలుగు) శ్రీ ''కులపతి'' కొంపల్లి అంజనేయ శాస్త్రి యం.ఏ; యం.ఇ.డి గారికిని. భక్తాగ్రేసరులు శ్రీ రామనామక్షేత్ర సంస్థాపకులయిన శ్రీ రాగం ఆంజనేయులుగారికిని, శ్రీశైలప్రభ సంపాదకులు భక్త కవిరత్న (శేషశ్రీ) పులిపాక చలపతిరావు, బి. ఏ. గారికిని, శ్రీ శివమహాస్వామి వారి శిష్యాగ్రగణ్యులగు శ్రీ పోలూరి రామకృష్ణయ్య యం.ఏ. గారికిని పండిత కవి; సత్యనారాయణ, గ్రేడ్ ఫస్టు తెలుగు పండిట్ - (మాచర్ల) గారికిని నమః పూర్వక కృతజ్ఞతలు తెలుపుచున్నాడను. సాహిత్య విద్యాప్రవీణ సంస్కృతోపన్యాసకులు చిరంజీవి దీవి శ్రీనివాసదీక్షితులు యం.ఏ. - (యస్.కె.ఆర్.బి.ఆర్. కళాశాల నరసరావుపేట) కును, కవి రాజమౌళి, సీనియర్ గ్రేడ్ తెలుగు పండితులు చిరంజీవి చింతలపాటి నరసింహదీక్షితశర్మ, (కోగంటివారిపాలెము - అగ్రహారము) కును నా హృదయపూర్వక శుభాశీస్సు లందజేయుచున్నాడ,

ఈ గ్రంథమును మిక్కిలి అందముగా ముద్రించి తగినరీతిలో నా కందించిన "శ్రీ వివేకానంద ప్రింటర్స్ అధికారులును అయిన శ్రీ అద్దేపల్లి చెన్నకేశవ గారికి హృదయపూర్వక వందనసహస్రము చేకూర్తును. వారికి శ్రీ సీతాసమేత శ్రీరామచంద్రమూర్తియు, శ్రీ రుక్మిణీసమేత శ్రీ కృష్ణపరమాత్మయు సర్వదా శ్రేయస్సును గల్పించుగాక యని వేడుకొనుచున్నాను. మరియు వారి సిబ్బంది ఎంతో శ్రద్ధాభక్తులతో కృషిచేసినందులకు శ్రీ భగవతీ భగవంతులు వారందరికీ ఆయురారోగ్యైశ్వర్యములు కలిగించుగాక!

"శ్రీ రామకృష్ణ లీలాతరంగిణి"యను నీ గ్రంథమును రచించుటలో అనేక గ్రంథములు, వ్యాసములు పత్రికలును నాకు మిక్కిల సాయపడినవి. నాకు దోడ్పడిన గ్రంథకర్తలకును రచయితలకును పత్రికా సంపాదకులకును నేను ఎంతయో కృతజ్ఞుడను.



# నా మాట

శ్రీ కొంపల్లి ఆంజనేయశాస్త్రిగారు
యం.ఏ., యం. ఇడి.,
ఆంధ్రోపన్యాసకులు
ప్రభుత్వ విద్యాకళాశాల, వరంగల్లు-1.

శ్రీ వెన్నెలగంటి లక్ష్మీనరసింహారావుగారి "తులసీ దళములు" అను పుస్తకమును చూచితిని. తెలుగున కందమువలెనే హిందీభాషలో చౌపాయీ మిక్కిలి ప్రసిద్ధి నొందినది. అట్టి "చౌపాయీ"లతో హిందీ భాషావాఙ్మయములో "శశి" వలె ప్రకాశించిన, మహాభక్త తులసీదాస విరచితమైన "హనుమాన్ చాలీసా"ను "తులసీదళములు"గ భావించి, తులసీదళ పవిత్రతను లోకములో చాటుటకై, తద్దళముతో హనుమంతుని పూజించ యత్నించిన హనుమద్భక్తులు, బహుగుణ ప్రజ్ఞశాలి శ్రీ వెన్నెలకంటి నరసింహారావుగారు.

శ్రీ శివ అవధూతస్వామివారి కృపాకటాక్షముచే మానందనర రంజిత కందములతో భక్తి ప్రసూనములవలె బహు గ్రంథముల రచించిన శ్రీ వెన్నెల కంటి లక్ష్మీనరసింహారావుగారు ధన్యులు

"త్రిభువనమ్ముల వెలుగుం జూపించు కపివరుండును, లలిత సువర్ణ చ్ఛాయాకృతతోనున్న మధుర వేషధారియును పరమేశ్వర వరభవుడగు హనుమంతుని "తులసీ దళముల"చే పూజించి, "స్తోత్రము" చేసి "దండకము" చదివి, కవి తన "భగవద్భక్తి"ని చాటుటకై ఈ చిన్న పొత్తమును పరమేశ్వరార్పణ మొనర్చిరి.

"శివమొగ్గ" బ్రహ్మశ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు తమ "ఆంజనేయమూర్తి స్వరూప నిర్ణయము" లో వివరించినట్లు ఆంజనేయుడు సర్వదేవతా స్వరూపుడే గాక రుద్రదేవత్మాకముగ భాసించినవాడు. అందువలననే "ఆంజ

నేయ దండకము'' చదివినచో ''సర్వభయ నివారణ'' జరుగుచుండుట తెలుగున జగద్విదితము.

అటులనే ''తులసీదాస'' కృతమగు ''హనుమాన్ చాలీసా'' ను ఒకమారు చదివిన ''భూత పిశాచనికటనహిఁఆవై మహావీరజబ నామసునావై'' అనునట్లు జరుగుట సత్యము, అదేవిధముగ ''జోశత్‌బార్ పాఠకర్ కోయీ'' అని చెప్పినట్లు వందమారులు చదివినవారు సర్వబంధ విముక్తు లగుదురనుట నిజము.

ఆ ''ఆంజనేయుడు'' సర్వదేవతలలో ''సుగమ అనుగ్రహుడు.''
ఆంజనేయ నామస్మరణము ''సర్వ సుఖదాయక'' మగుటచే శ్రీ వెన్నెల కంటి లక్ష్మీనరసింహారావుగారు ఈ చిన్ని స్తోత్రము రచించుటకు ముదావహము.



# శుభాకాంక్ష

శ్రీమాన్ బృందావనం రంగాచార్యులుగారు
సీనియర్ తెలుగుపండిట్,
వై.యస్.ఆర్. హైస్కూలు. పరుచూరు.

తొలిజన్మల సల్పిన పూ
జల ఫలమై లభ్యపడియె శారదకృప త
ల్లలితాను రాగబలమున
కొలిచెన్ రఘువరుని సేవకున్ మదిపొంగన్.

ఈ "హనుమాన్ చాలీసా"
స్నేహాదరణముల తెలుగు సీమన్ గనుచున్
గేహము లన్నింట పవి
త్రోహల వెలయించు.గాక ! ఉజ్జ్వల లీలన్.

తెలుగు తులసీ దళములై
విలసత్ పావని పదాబ్జ విభవార్చనలై
కలకాలమ్మిట్లే వె
న్నెలగంటి రచనలు రామునిన్ స్మరియించున్.



# పరిమళము

భాషాప్రవీణ
చింతలపాటి నరసింహదీక్షిత శర్మ
కోగంటిపాలెము, అగ్రహారము

శ్రీయుతుడు సరసహృదయులు, మదీయ శ్రేయోభిలాషులు శ్రీ వెన్నెల గంటి లక్ష్మీనరసింహారావుగారు అనుభవమునకు ఆదర్శజీవనము, ఆప్యాయతకు ఆచరణము, ఆదరమునకు ఆహ్లాదము, సౌమనస్యమునకు సముల్లాసము, సారస్వత మునకు స్వయంకృషి, జోడించి వాణీ రచనసేవలో పారంగతులైన విజ్ఞులు వీరు తమకుగల భక్తిభావనను సర్వతోముఖముగ ప్రసరింపజేసి అద్వైత సౌరణ మును దిగంతముల వెదజల్లినారు. ''పూర్వ పుణ్య వశాదేవ పుంసామద్వైత వాసనా'' అన్న సూక్తి వీరిపట్ల సార్థకమైనవి. రామకార్య నిర్వహణ పరాయణుడై హనుమానుడు వీరికి గురువరరూపమున నవ్యప్రోత్సాహ మొసగిరి. ఈ తులసీదళ ములను విలసిల్ల చేసిరనుట మెచ్చదగిన నిత్య సత్యము.

"బుద్ధిర్బలం యశోధైర్యం నిర్భయత్వ మరోగతా
అజాడ్యం వాక్పటుత్వంచ హనుమత్ స్మరణాద్భవేత్''

అన్న శ్లోక పరమార్థము వీరికి సరసముగా సమన్వయతను సిద్ధింప జేసి నది. ఇంతవరకు నాకుతోచిన నాల్గుపల్కులు తెల్లిమొనర్చితి. ఈ తులసీదళ సౌర భ్యము భక్తజనులకు హృదయామోదకమై పవిత్రతను పాదుకొల్పి, నవసిద్ధి ప్రదంగావుత మని నా నిశ్చప్రపచమైన ఆకాంక్ష—

వెన్నెలకంటి నృసింహుని
వెన్నెల వన్నెలనుదగు కవిత్వ సుధా శ్రీ
పున్నెముగల భక్తుల సం
సన్నుత ఘటియించి జ్ఞాన పరిమళ మొసంగున్

శుభం భూయాత్

# శ్రీహనూమాన్
# చత్వారింశత్పద్యరత్నమాల

(తులసీదళములనుండి)

[శ్రీ తులశీకృత హనుమాన్ చాలిసాకు తెలుఁగు సేత]



శ్రీగురు పదాబ్జరజములచే మదీయ
హృదయ దర్పణమాలిన్యమెల్ల తుడిచి
శ్లాఘ్యధర్మార్థ కామమోక్షము లొసంగు
శ్రీ రఘూత్తము కీర్తివర్ణించువాఁడ

బుద్ధిహీనత!నిమేను పొడమెననుచు
తెలిసికొనివాయు సుతు సన్నుతింతు, నతడు
బుద్ధిబలవిద్యల నొసంగి భూరికామ
వికృతిభవ కష్టముల నెల్ల వెడలగొట్టు.

1. జ్ఞానగుణరాశి హనుమం
తా! నీకుజయమ్ము త్రిభువనమ్ముల వెలుగుం
బూనించు కపివరా! వి
జ్ఞానధుని! నీకు జయముగావుత హనుమా!

2. శ్రీరామదూత! సారా
చార! మహాసత్వశాలి! చరితార్థ! కళా
ధారా! అంజనితనయా!
ధీరా! పవమానపుత్ర! ధృతియుత! హనుమా!

3. తాపత్రయహర! విక్రమ
రూప! మహావీర! సత్వరూఢ కుబుద్ధి
వ్యాపారహర! సుబుద్ధి
శ్రీ పరిపాలక! నినున్ భజించెద హనుమా!

4. శ్రీయుత! లలితసువర్ణ
చ్ఛాయాకృతి! మధురవేష! సత్కుండలక
ర్ణా! యుజ్జ్వలకేశకలా
పా! యంఘ్రి వినమ్రతాపహరణా! హనుమా!

5. సురుచిర కర పద్మమ్మున
అరుదుగ వజ్ర ధ్వజాంకుశాదిక రేఖల్
మెరయ భుజమ్మున జందెము
వరముంజయు నొప్పలొలుకునాడవు హనుమా!

6. పరమేశ్వర వరభవ! కే
సరిసుతే! తేజఃప్రతాప సంచితవిభవా!
వరదాయక! సకల జగ
త్పరి కల్పిత వందన ప్రభావా! హనుమా !

7. ఓ విద్వన్మణి! కల్యా
ణావధి! సద్గుణవిశాల! అతిచాతుర్య
శ్రీ విభవ! రామకార్య
మ్మే వేళనుజేయగోరుదీవె హనుమా !

8. శ్రీరామచంద్ర మధుర క!
ధారాగ శ్రవణరసిక ధన్యమణి ! సీ
తా రామ లక్ష్మణుల, చే
తోరంగమ్మున ధరించుధుర్యా ! హనుమా!

9. ఓమహిత! నాడు సూక్ష్మం
బౌమేను ధరించి సీతకగపడినమహా
ధీమంతుడవు, లంకం
భీమాకృతి కాల్చినట్టి మేటివి! హనుమా!

10. అతిభీకర రూపముగొని
దితిసుతులను లంకలోన దెగటార్చితివా !
క్షితిపతిరాముని పని స
మ్మతి నెరవేర్చితివి ధీర ! మహితోహనుమా !

11. అచ్చెరువుగ సంజీవని
తెచ్చియు బ్రతికించినావు తేకువతో నా
లచ్చన్నను, రఘుపతినిను
మెచ్చియుహత్తుకొనె నెదకు మేలుగ హనుమా !

12. నినుగొప్పగ పొగడియు నా
జనక సుతాభర్త "భరతసదృశుండవు నీ
వనె" నింతకన్న నీకిం
కనుగలదే చారితార్థ్య ఘట్టము హనుమా !

13. వేయి విధమ్ములుగాగను
నీయశమున్ పొగడి పొగడి నినుగౌగిటికా
హ్వాయమ్ముగజేర్చుకొనెన్
శ్రీయుతుడౌ రామమూర్తి-క్షితిపతి హనుమా!

14. సనకాదులు, బ్రహ్మాదులు
మునులు సరస్వతియు, శేషభోగీంద్రుండున్ !
ఘనులు దిగీశులు కవి స
జ్జనులును, నీ యశము పొగడజాలరు హనుమా !

15. నీవే వానరపతి సు
గ్రీవునకున్ రాము చెల్మిగీల్కొల్పితి మే
ధావంతుడ, వతనికి సు
శ్రీ వెలుగగ రాజ్యపదము చేర్చితిహనుమా!

16. నీవిమలబుద్ధి చాతురి
నావేళ విభీషణుండు నతిలోకజయ
శ్రీ విలసితలంకా ల
క్ష్మీ వల్లభుడయ్యె కీర్తిచేకొని, హనుమా!

17. అల రెండువేల యోజన
ములదూరమునందు నల్లపొడిచెడి భానున్
ఫలమని భావించియు నీ
వలవోకగ్రహించితివి మహాత్మా హనుమా!

18. శ్రీరామముద్రికను, దో
స్సారమ్మునబ్ధిదాటు సమయమ్మున నీ
నోరందాచితివటగా
యౌరా ! యచ్చెరువుగొల్పునయ్యా ! హనుమా !

19. జగదవనదీక్షితా! యీ
జగమున దుర్గమమనంగ జాలెడుకృతియున్
నుగమంబునీ యనుగ్రహ
ము గలిగినంతటనె సుగుణ భూషణ ! హనుమా

20. శ్రీరఘురాముని సింహ
ద్వారము కాచుదువు సర్వదా ! నీ యాజ్ఞన్
సారమ్ముగొనక లోనికి
జేరన్గావీలులేదు సిద్ధము! హనుమా!

21. నిను శరణు వేడినను క
ల్గును సర్వసుఖమ్ము లీవు గురుకరుణాప్తిన్
మనుపుచునుండగ నేరిని
గనియును భీతిల్లురీతికలుగదు హనుమా!

22. నీ విపులతేజ మొర్వగ
నీ వేతగురువు మహాత్మ ! నేరికితరమౌ
నీవొక్క కేకవేసిన
చో వణకున్ త్రిభువనములు సుడివడి హనుమా!

23. సకలరిపుహారి ! తేజో
ముకురమ్మౌనీదు నామమును విన్నంతన్
వికవికపాత్రై పాఱుపిశా
చక భూతప్రేతతతులు చయ్యన-హనుమా !

24. అనిశము వీరహనూమం
తుని జపియించిన సమస్తదుష్టామయముల్
వెనువెంటనె నశియించును
పెనుపీడిలు తొలగిపోవు వేగమె-హనుమా!

25. మనుజుడు త్రికరణ శుద్ధిగ
హనుమంతుని నెవడు హృదినిధ్యానించునో యా
తని బ్రోచు సంకటములన్
పెనుగొనగానీకహనుమ ! ప్రేమనుహనుమా !

26. రాజశిరోమణి రాముఁడు
రాజ మహామౌనిరత్నరాజిక, నా శ్రీ
రాజీవ నేత్రు పనులను
రాజిల్లగనీవు జేతు రక్తిగ హనుమా !

27. అవధానము నీయందిడి
యెవరేయది కోరుకొనునో యేయేవేళన్
చివురింపజేసి దానిని
నవఫలములనందజేతునైపుణి-హనుమా !

28. నాలుగు యుగములయందున్
మేలై విలసిల్లె నీయమేయమహా ధీ
శాలిప్రతాప, మదియే
యోలి సముజ్వలత జగమునుంచును-హనుమా !

29. అనయము సాధులసజ్జను
లను బ్రోచెదునీవు దుష్టులగు రక్కసులన్
దునుమాడి వీరుడగు రా
మునుకుం బ్రియతముడవైతి పొందుగ-హనుమా!

30. పరమపతి వ్రత జానకి
స్థిరవరము నొసంగె నష్టసిద్ధులునటులే
పరమనవనిధులు నొసగెడు
పరిణతినీకెంత తపము పండెను హనుమా !

31. ఎన్నగరామరసాయన
మున్నది నీ యొద్దదాని యుజ్జ్వల లీలన్
గొన్నట్టి భక్తుడవు నీ
వన్నళినాక్షునకు ప్రియుడవైతివి-హనుమా!

32. నిను మేము భజించుటరా
మునకానంద ప్రదమ్ము భూతభవిష్య
జ్జననాంతర దుఃఖమ్ముల
మనుగడమరపింపజేయు మాకును-హనుమా!

33. నినుగొలిచియెచట జన్మిం
చినహరిభక్తులను బిరుదు చెందుదుమయ్యా
జనుదురు తుది శ్రీరాముని
ఘనపురి కా సర్వభక్త గణములు-హనుమా!

34. పెరవేల్పుల చిత్తమ్మున
ధరియింపక ఆంజనేయుఁదలచిన యెడలన్
స్థిరపడజేయునతండే
ధరణి సకలసౌఖ్యములను — తప్పక — హనుమా !

35. బలవీర్యశాలియై తగు
బలఘునిహనుమంతు తలచినంతనె, పీడల్
తొలగును, సంకటములు ప్ర
క్కలగున్, సౌఖ్యమ్ము లెల్లకల్గును — హనుమా !

36. మనమా ! జేజే, జేజే
యనుమా ! హనుమంతునకు మహాగురు దేవుం
డనగా ననుదయ నేలుమ
నినుగొల్చెద నెల్లవేళ నేనిక - హనుమా !

37. దీనికొక నూరుసారులు
ధ్యానస్థిరుడౌచు పఠనతప్పక చేయన్
వానికిబంధనములు వీడి
జ్ఞానమహాసౌఖ్యమబ్బు చయ్యన - హనుమా !

38. "హనుమాన్‌చాలీసా" యను (హనుమాన్ చత్వారింశతి)
ఘనమౌ స్తోత్రమ్మునెవడు ఘనభక్తి మెయిన్
గొని చదువునో సిద్ధి గొను
జనుడాతడుమా మహేశ సాక్షిగ - హనుమా !

39. తులసీదాసుడు సతతము
నళినాక్షుని దాసుడగును, నాథా - యెపుడున్
నిలుపుము, నాకోమల హృ
జ్జల జాతమునందు నుతులుసలుపుదు – హనుమా -

40. మరుదాత్మజాత ! సంకట
హరణా ! మంగళవిధాత ! అవనిజయుతమై
వరరామలక్ష్మణామర
పరివారముగూడి హృదిని వర్తిలు హనుమా !



# దండకము

శ్రీరామదూతా ! మహానందదాతా ! మహాత్మా !
మహాదేవ ! ఓంకారరూపా ! హరీ ! శంకరాంశో
ద్భవా ! సుందరాదేవ ! వీరాధివీరా ! సుధీరా !
సువీరా ! శుభాకార ! సత్యస్వరూపా ! సుకేశా ! త్రి
మూర్తిస్వరూపా ! కపీశా ! బుధేశా !
మహాబుద్ధిశాలీ ! త్రిలోకంబులన్ నీకు కైవా
రముల్ సేయరే స్వామి ! శ్రీరామనామైకమాధు
ర్యమున్ చాటి విఖ్యాతిగైకొన్న శ్రీరామభక్తా !
మహాభాగ ! శ్రీ బ్రహ్మవిద్యానిధానా ! కపీశేం
ద్రసేనాప్రధానా ! సదావాస శ్రీరామభద్రుండవే స్వామి
శ్రీ ఆంజనేయా ! ప్రసన్నాంజనేయ
మముంబ్రోవుమయ్యా ! పరేశా ! మహేశా !
మదీశా ! నమస్తే ! నమస్తే ! నమస్తే ! నమః

ఓం శాంతిః శ్శాంతిః శ్శాంతి.
శ్రీ గురుదేవులకు సమర్పితము
ఓం తత్సత్
సర్వేజనాః సుఖినోభవన్తు.
శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ

---

NB:—14, 15 చౌపాయిల సారము ఒక్క పద్యమునందే అంతర్భ
వించినది.

# భగవద్భక్తి

భగవత్కృపవలననే భవాబ్ధి దాటగలము. ఎన్ని జన్మములెత్తినను ప్రతి జన్మయందు నిశ్చలమైన పరమేశ్వరుని పదభక్తినే గోరుడు. నిశ్చలభక్తితోబాటు అహింసయు, భూతదయయును, ప్రతిఫలాపేక్షలేని పరోపకార శీలమును, జ్ఞాన వైరాగ్యములను గలిగియుండుడు. సద్గురువు నాశ్రయించి జ్ఞానము సంపాదింపుడు. అట్టి సద్గురువులు చిరంజీవియు, రామ భద్రుండునునగు శ్రీ ఆంజనేయస్వామివారు సర్వ దేవాత్మక స్వరూపులు సమస్తదేవతలు ఆయనలోనే కలరు. సాక్షాత్పరమేశ్వరుడే శ్రీ రామనామ మహిమను, అనన్యభక్తిని జ్ఞానమును, ఆదర్శభక్తి జీవితమును లోకమునకుఁ జాటుటకై ఇట్లవతరించినారు.

శ్రీ రామనామ మాహాత్మ్యమును లోకమునకు జాటినవాఁడు హనుమంతుఁడు రామనామముమీద ఆయనకు గల విశ్వాసముచేతనే నూఱామడ సముద్రమును దాటగల్గెను. శ్రీరామునికంటె రామనామమే శక్తిగలదని లోకమునకు జాటిన రామభక్తుఁడు.

శ్రీరామునకు హనుమంతుఁ డనన్యభక్తుడు ''యత్ర యత్ర రఘునాథ కీర్తనమ్. తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్'' ఎచ్చటెచ్చట శ్రీరామకీర్తనము జరుగునో అచ్చట హనుమ మూర్ధమును జేతులనుంచుకొని కనులనానంద భాష్పముల రాల్చుచుండును.

హనుమానునిగాంచిన సమస్త భూతప్రేతపిశాచబ్రహ్మరాక్షసులు తొలఁగిపోవును. హనుమంతుని మించిన దైవము శ్రీరాముఁడు తక్క వేఱులేడు. శ్రీరామభక్తులకు హనుమంతుఁ డంగరక్షకుఁడు.

హనుమంతుడు సర్వదేవతా స్వరూపుడు-ఆయనను సమస్త మతముల వారు సేవించెదరు. సేవింపవచ్చును. ఎట్లు సేవించిన వారికట్టిఫలము నొసంగును. వారిని సేవించిన సమస్త పీడలు, కష్టములు తొలగి జయము కలుగుననుటలో, నిసుమంతయును సందేహములేదు.

మారుతాత్మజుని మంజుల మంగళ స్వరూపము ఆనందమయమైనది రఘువర దూతయగు హనుమానుని స్మరించినచో సకలసిద్ధులును కరతలగతములగును.

ధీరుడును రఘువీరునకు ప్రియుడునగు పవన కుమారుని స్మరించినచో దుర్లభకార్యములన్నియు సుగమములగును. సిద్ధి కరతలామలకమగును.

సుఖమునకును మోదమునకును మంగళములకు కలువలకు జంద్రునివంటివాడును సుగుణములకు కమలమునకు సూర్యునివంటివాడునగు హనుమంతుడు హృదయములోనికి వచ్చెనా సమస్త కార్యములను శుభాంతములుగా సిద్ధింపజేయును. ఫలవంతములను మంగళశకునములు గలుగును. మంచికీర్తి విజయము, విభూతికలుగును. పవనకుమారుడు శూరమణి, సాహసి, సుమతి ఆయనను స్మరించినవారికి సమస్త సుఖసంపదలను ఆనందములు శుభములను నొసంగును.

ఎవరికి హనుమంతుడే గతియో వారిప్రతిజ్ఞలన్నియు సిద్ధించును ఇది వజ్రము లేక రాతిపై వ్రాసిన గీతవలె నిశ్చయము సత్యము.

ప్రస్తుత మీ గ్రంథము శ్రీ తులసీదాస కృతమగు "హనుమాన్ చాలీసా"ను "తులసీదళములు" మరియు "శ్రీ హనుమాన్ చత్వారిత్పద్యరత్నమాల" అను తెలుగు ప్రయోజనమును బొందవలయునని మాముఖ్యోద్దేశము.

మన తండ్రియై, మన తల్లియై, మన మిత్రుడై, మన సఖులకు సఖుడై, మన ఆత్మలకు పరమాత్మయై పరగు మన గురుదేవులు సర్వశుభంకరమూర్తి అపార కరుణాస్వరూపి! ఇట్టి భగవత్ స్వరూపము శైవులకు శివుడును వైష్ణవులకు విష్ణువును కర్మపరాయణులకు కర్మదేవతయు, బౌద్ధులకు బుద్ధుడును, జైనులకు జినుడును క్రైస్తవులకు యెహోవాయును మహమ్మదీయులకు అల్లాయును ప్రతి సంప్రదాయమునకు ఆ సాంప్రదాయక దేవతయు, వేదాంతులకు బ్రహ్మమునై యెప్పు ఆ సర్వేశ్వరుడు పూర్ణ తేజముతో సాక్షాత్కరించు గాక!

ఆ సర్వవ్యాపి మనలను ఆశీర్వదించుగాక! మనకు అండయై నిల్చుగాక! మనకు బలమును ప్రసాదించుగాక! ఈ దివ్యభావమును ఆచరణలో పెట్టగల సాహసమును మనల కొసగుగాక! మనము వినినదియు, మనము చదివినదియు మనలో సంస్కారరూపమున వెలయుగాక! అది మనకు సత్యమై యొప్పుగాక! మనము పరస్పర సాహాయ్యము చేసికొనుటకది శక్తిరూపిణియై చెలగుగాక! మనము ఒకరిని గురించి ఒకరము అసూయాపరులము కాకుందుము గాక!

హరినామము శాంతి వెలయుగాక!

ఓం శాంతిః శాంతిః శాంతిః

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# శ్రీ గురుదేవుని ఆదేశము

(అ) పురుష ప్రయత్నము (ఆ) విధినిర్వాహణము

(ఎ) పరమాత్మ ! (బి) జీవాత్మ ! (సి) మనస్సు (డి) శరీరము (ఇ) ప్రపంచము యఫ్) లావాదేవీలు, లాభనష్టములు, పూర్వజన్మ పునర్జన్మలు.

పరమాత్మను చేరుటకు పురుషుడు ప్రయత్నముచేసిన పరమాత్మ సహాయము చేయును అటుల కానియెడల పూర్వజన్మ పునర్జన్మలు, లావాదేవీలు, లాభనష్టములు, యీ ప్రపంచములోనున్న అన్ని కష్టసుఖములు మానవుడే అనుభవించవలసినదే కాని పరమాత్మకు సంబంధము లేదు.

ఓంకారంబే బ్రహ్మము
ఓంకారంబుననె జగము లుద్భవమొందున్
ఓంకారమందె శ్రీయను
ఓంకారంబే త్రిమూర్తియుతమని కనుడీ॥

ఇ తి శ మ్



# -: కళ్యాణ సుమమంజరి :-

శ్రీ అలమేలుమంగా శ్రీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామి వారి కళ్యాణ మహోత్సవ సందర్భమున

## -: పంచ రత్నములు :-

శ్రీమంతమ్ము సమస్త భక్త జనతాక్షేమప్రదమ్మా శ్రిత
స్తోమానందపదమ్ము, వైదిక శిఖాశుద్ధాంత సౌందర్యలీ
లామాంగల్య కళానుగమ్య, మలమేల్మంగాఖ్య పద్మావతీ
శ్రీమద్వేంకటనాధ సత్పరిణయశ్రీ, మమ్ము రక్షించుతన్.

తల్లీ ! అలమేల్మంగా ! చల్లని కనికరపు సుధలు జాల్కొనుజూపుం
జల్లులు మాపై మెల్లగ జల్లుము-కళ్యాణవేళ సంపత్తులతో,-

అమ్మ! పద్మావతీ! చక్కనయ్య భర్త
జిక్కెనని కుల్కుచును, మమ్ము చిన్నచూపు
చూడఁబోకుము, వడ్డీ కాసులను మెచ్చు
దొర దయాదృష్టి మామీద బరగనిమ్ము

అలరుంగొమ్మలు ముద్దుగుమ్మలొక సయ్యాటంబు గల్పింపనా
యలరుందూపుల జోదు తూపులకు లోనై సామినీమేల్మి పెం
డిలివేళన్ మమ్ము విస్మరింపక రవంతేనిన్ దయాదృష్టిను
జ్వలమున్ జిల్కుము వేంకటాచలపు రేశా! వేంకటేశ ప్రభూ!

సకల జగచ్చయంబులకు సంతతమున్ నవమంగళమ్ములన్
ప్రకటన సేయు నీకిట వివాహములీలయగాక, అన్యమా!
సుకము లొసంగు నీ యెడల చూపెడు భక్తి నిదర్శనంబిదే
శుకముఖ మౌని సన్నుత యశోధన వైభవ! వేంకటేశ్వరా!

మంగళమ్ మహత్
శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

ఇట్లు
స్వామివారి సేవకులు,
శ్రీ వెన్నెలగంటి లక్ష్మీనరసింహారావు
శ్రీమతి వేంకటసీతారామమ్మ
ప్లాట్ నెం. 75, శారదనగర్,
హైదరాబాదు-500267.

అవధూతశిషా! గురుదేవశిషా!

అవధూత చింతన శ్రీ గురుదేవశిషా!

వందేమాతరం! హాంహహి!



# శ్రీ మాత్రేనమః

దండకము

శ్రీ రాజరాజేశ్వరీ! ఈశ్వరీ! సర్వలోకేశ్వరీ! అన్నపూర్ణేశ్వరీ! అంబ! కాత్యాయనీ! గౌరి! దుర్గా! భవానీ! ఉమాలోకమాతా! సతీదేవి! విశ్వేశ్వరీ! వేదమాతా! శివాణీ! మహాదేవి! గాయత్రి! సావిత్రి! నారాయణీ! భద్రకాళీ! పరాదేవతా! పార్వతీ! వైష్ణవీ! చండి! కామేశ్వరీదేవి! శార్వాణి! శ్రీశారదాంబా! మహాలక్ష్మి! మాహేశ్వరీ! బ్రాహ్మి! సర్వేశ్వరీ! హైమ! వారాహి! కౌమారి! ఇంద్రీ! పరాశక్తి! విద్యాయవిద్యా! మహామాయ! జ్ఞానేశ్వరీదేవి! పాలింపరావమ్మ! యజ్ఞానదోషంబులం బాపి మన్నించి మమ్మేలుమమ్మా! మహాశక్తి! చక్రేశ్వరీ మాత! దాసావనీదేహి భక్తిం భవత్పాదపద్మే! మదీయం హృదంభోరుహంతే! ప్రదాస్యామి! దాస్యామి ఓంకారరూపా! నమక్ కల్పవల్లీ! జగన్మాత! తల్లీ! నమస్తే! నమస్తే నమః

ఓం శాంతిః శ్శాంతిః శ్శాంతిః



శ్రీ ర స్తు

శ్రీ మహాగణాధిపతయే నమః - శ్రీ మహాసరస్వత్యై నమః
శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరాయ నమః - శ్రీ వేంకటేశాయ నమః
శ్రీ శివకుమార స్వామినే నమః

# శ్రీ రామకృష్ణ లీలాతరంగిణి

సుమంగళగీతిక. శ్రీ వేంకటేశ సుప్రభాతమ్



శ్రీరామా ! తూరుపు తెల
వారెను కౌసల్యాతనయ పావన నామా

నారాయణ వామన సీ
తారామా ! మేలుకొనుము దశరథరామా

దేవాదిదేవ ! గిరిధర !
వేవేగమె లే నృసింహ ! వేంకటరమణా !

దేవాదులు నిను గొలువగ
రావే శుభములనొసంగ రాధాకృష్ణా!

జననీ అలమేల్మంగా !
జనులెల్లరు నిన్నుజూచి సన్నుతి సేయం

గను వచ్చిరి తెలవారెను
కనికరమున వారిబ్రోవ గ్రక్కునరమ్మా.

అమ్మా ! లక్ష్మి! మంగా !
లెమ్మా ! భక్తులనుబ్రోచి క్లేశౌఘములన్
వమ్మొనరించి శుభమ్ముల
నిమ్మా ! స్మరియింతునిన్ను నింగితమతినై.

స్వామీ ! వేంకటరమణా !
స్వామీ ! మేల్కొనుము మునుల ప్రార్థన వినుచున్
క్షేమము గూర్పుము మాకిల
క్షేమంకరిదేవ ! దేవ శ్రీఘ్రమె లెమ్మా.

దేవా ! వేంకటరమణా !
దేవాదులు నిన్ను గొలువ తృప్తిని వరుసన్
భావించి యున్నవారలు
వేవేగమె తిరుమలేశ వేడ్కను లెమ్మా.

నినుగొలువగ బ్రహ్మదులు
జనుదెంచిరి మేలుకొనుము సన్నుతచరితా
కనకాంబరధర ! లెమ్మా
కనికరమున వారిబ్రోవ కాంచనచేలా.

లే, సుప్రభాతమయ్యెను
లే, సురసంపూజ్యా వేగ లేవయ్యా హరీ
లేశము కరుణించుము మము
నీ శరణమె మాకు దిక్కు నిగమస్తుత్యా.

స్వామీ ! పన్నగశయనా !
స్వామీ ! శ్రీ వేంకటేశ ! వరశుభ చరితా !
స్వామీ ! తెల తెలవారెను
స్వామీ ! లేవయ్య కుసుమవాసన వీచెన్.

శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం

స్వామీ ! దీనశరణ్యా !
నీ మహిమను బాడుచుండె నిఖిలఖగమ్ముల్
భూమిరుహములనుండియు
నీ మాధుర్యప్రసన్న నిరుపమచరితన్.

శ్రీ శేషాద్రి నివాసా !
లేశంబును జాగులేక లెమ్మా ! స్వామీ
నీ శరణార్థుల మమ్మును
దోసములను బాపి ముదముతో గనవయ్యా.

నారద తుంబురులింపెగ
సారెకు మహతీ నినాద సంగీతముతో
జేరి నుతింపుచు నుండిరి
సారసదళనయన నీదు సందర్శనకై.

ప్రేమాస్పదులగు యాదవ
భామిను లిదె పెరుగుజిలుక బరగెడు రవముల్
నీ మధుర గాథ దెల్పెడి
స్వామీ ! విని మరచినావో, సంధ్యాక్రతువుల్

ఝుంకారంబులు చేయుచు
పంకజముల వెడలివచ్చె, భ్రమరంబులివే
పంకజముఖి పద్మావతి
యంకంబున గూడిరార, యజహరవినుతా.

అలమేల్మంగా రమణా !
తెల తెలవారంగనయ్యె, దిక్కులనెల్లన్
కలరిట ననేక భక్తులు
చలమేలను వేంకటేశ చయ్యనలెమ్మా.

శివకమలజ ముని దేవ
ప్రవరులు లోకహితకాంక్ష పరపుష్కరిణిన్
అవిరళము స్నానమాడుచు
భువి నీదర్శనముఁజేయఁ బూనిరి భక్తిన్.

తిరుమల వేంకట రమణా!
సరసీరుహనేత్ర నిన్ను సన్నుతిజేతున్
గరుడా, వృషభా, వేంకట
గిరి, నారాయణ, వృషాద్రి, గిరిధరనామా.

శ్రీరమణా! గోవిందా!
నీరాకను మదిదలంచి నిర్మలమతులై
సారెకు సంస్మరియించుచు
ధీరతతో నుండిరెల్ల దిక్పాలకులున్.

లెమ్మా! వేంకటరమణా!
సమ్మతి శ్రీవైనతేయ, సైంధవ, గజ సిం
హమ్ములు మరి శేషుండును
ఇమ్మహి సేవింప నిన్ను నిందుండిరిటన్

ఆదిత్యాదులు భక్తిని
నీ దర్శనభాగ్యమునకు నిలచిరి వారిన్
మోదమున కనికరింపగ
సాదరముగ రమ్మువేవ! సరసిజనేత్రా.

స్వామీ! కలియుగ దేవా!
నీ మహిమను భక్తులెల్ల నిండినభక్తిన్
ప్రేమను బాడుచు నుంటిరి
పామరులను మమ్ముబ్రోచి భద్రములిమ్మా.

వీడిరి నాకము మోక్షము
వేడిరి, నినుభక్తకోటి, వేంకటరమణా !
పాడిరి నీ మహిమంబుల
వేడుకతో బ్రోవరమ్మ ప్రియభక్తతతిన్.

దేవాధిదేవ ! లక్ష్మీ
దేవిప్రియ హే దయానిధే, త్వరనిటు, రా
వే, వరదాయక, రామా !
సేవకులను మమ్ముబ్రోచి సిద్ధినొసగుమా

శ్రీ వైకుంఠనివాసా
శ్రీవిష్ణూ, వాసుదేవ, సీతారమణా !
పావననామా ! దేవా !
వేవేగమె మేలుకొనుము వేంకటరమణా !

స్వామీ ! వేంకటరమణా !
స్వామీ ! నాంచారిహృదయవాస, నమస్తే
నీ మహిమ నెఱుగ వశమే,
స్వామీ ! శేషాద్రివాస, సరగునరారా!

వేంకట భూధరవాసా !
పంకజముఖు లిపుడునీకు పరిమళజలముల్
బొంకముగను సురగంగ న
లంకరణకు దెచ్చిరయ్య, లక్ష్మీరమణా !

శ్రీ మత్స్య, కూర్మ, కిటినగ్
వామన, నృసింహ, రామ, భార్గవ, బలరా
మామల కృష్ణ కలికిముఖ
నామమ్ముల దనరితివి, ఘనంబుగ, లెమ్మా!

పూజార్థ మఱుగుదెంచిరి
పూజాద్రవ్యములతోడ మునివరులెల్లన్
భ్రాజిష్ణుడవు శుభాంగా
పూజలుగైకొనుము మమ్ముఁ బ్రోవుము దేవా.

స్వామీ ! లక్ష్మీరమణా !
రామా ! లేలే, తరింప ప్రార్థింతుమయిన్
స్వామీ ! తెల తెలవారెను
స్వామీ ! శ్రీ శ్రీనివాస వందమిదిగో.

ఓం శాంతిః శ్శాంతిః శ్శాంతిః

శ్రీ ర స్తు

# వేంకటేశస్తోత్రమ్

జయజయ ! వేంకటరమణా !
జయజయ ! తిరుమల నివాస జయపరమేశా,
జయజయ ! కమళదళాక్ష
జయజయ మాధవముకుంద, జగదాధారా ॥

పాలింపుము నీ భక్తుల
నాలింపుము నాదుమొరల నార్యస్తుత్యా,
చాలగ దీనుల బ్రోవను
మేలుకొనుము వేంకటేశ మిక్కిలిదయతో॥

స్వామీ ! శ్రీహరిదేవా !
నీ మహిమంబే నెఱుంగ నీరజనాభా
పామరుడ నీకు దాసుడ
స్వామీ ! శ్రీ శ్రీనివాస, సన్నుతిజేతున్.

స్వామీ ! శ్రీయదునందన
స్వామీ ! తిరుమల నివాస సజ్జనవినుతా,
స్వామీ సేవించెద నిను
కామిత ఫలదాయకా వికార విదూరా.

దేవా ! శ్రీనరసింహా !
నీవేదిక్కనుచు నమ్మి నిర్మలమతినై
భావింతు నిన్ను నెప్పుడు
రావే కరుణింప నన్ను రయమున దేవా.

స్వామీ ! లక్ష్మీరమణా !
స్వామీ : కరుణాసముద్ర వందనమిదిగో
స్వామీ ! దీనజనావన
కామిత మీడేర్చవయ్యా కమలదళాక్షా.

దేవా ! విశ్వవ్యాపక
దేవేంద్ర సురాదివంద్య త్రిభువనపాలా !
లేవయ్యా తెల్లవారెను
కోవెలలో భక్తజనము కూడిరిసిక్రై

నీవే దిక్కని భక్తులు
భావించెదరయ్యా నీవు వారల బ్రోవన్
రావయ్యా తిరుమలేశా
సేవించెద నిన్ను జన్మసిద్దినొసగుమి.

నీ దిక్కే నాకు సర్వము
నీ దిక్కే నన్నుబ్రోచు నిశ్చయమిది, నీ
పాదాబ్జంబుల గొలిచెద
వాదేలను నన్నుగావ వలెను మహాత్మా.

స్వామీ ! వేంకట గిరిధర
స్వామీ ! నీపాదపద్మ భవ్యార్చనమున్
నిమంబుతోడ చేసెద
నామనవిని గాంచుమయ్యా నళినదళాక్షా.

దేవాదిదేవ ! మాధవ !
నీవాడను నన్నుబ్రోవు నినునమ్మితిరా
నీవే తల్లివి దండ్రివి
దేవా ! ననుగావుమయ్యా దీనశరణ్యా.

ఓం శాంతిః శాంతిః శాంతిః

శ్రీరస్తు

# శ్రీ వేంకటేశ ప్రపత్తిః

దేవీ ! త్రిజగన్మాతా !
కావగ రావేల నన్ను కారుణ్యనిధీ
వివిధముల స్తుతియించెద
భావంబున దలచివేగ భద్రములిమ్మా.

కావుము జగదీశ్వరివై
కావుము నన్నెప్పుడిలను కారుణ్యముతో
సేవింతు నీదు పదములు
కావుము ననుగన్నతల్లి కంజదళాక్షి.

స్వామీ ! శ్రీమురళీధర !
స్వామీ ! నీ పాదములను భక్తిని గొలుతున్
స్వామీ ! శ్రీలక్ష్మీపతి
స్వామీ ! దయసేయుమయ్య ప్రార్థింతుమనిన్.

స్వామీ ! ప్రహ్లాదవరద,
స్వామీ ! నీ చరణపూజ సల్పెదనయ్యా !
స్వామీ ! సేవించెద నిను
స్వామీ ! శ్రీ వేంకటేశ వందనమిదిగో.

నీ దాసదాస దాసుడ
నీ దర్శన భాగ్యమిమ్మ నిగమస్తుత్యా,
శ్రీ దేవా ! వరదాయక
నీదుదయను జూపుమయ్య, నీరజనాభా.

సేవకుడనయ్యా నీదగు
సేవా భాగ్యమ్ము నాకు సిద్ధించునటుల్
వేవేగ వరములిమ్మా
నావిన్నప మిదియె నిన్ను నమ్మితిదేవా !

శరణార్థిని ననుగావుము
కరుణాకర కమలనయన కాంచనచేలా
దురిత విదూరా నీ మృదు
చరణాబ్జంబులను గొల్తు చారుచరిత్రా

వందనము వెంకటేశా !
ముందుగ గొనుమయ్యా నిన్ను పూజింతునిలన్
సందేహింపక బ్రోవుము
సుందర చారిత్ర కరుణ జూడుము నన్నున్ !

శరణము కలియుగదేవా !
శరణము శేషాద్రివాస ! శరణార్థిననన్
కరుణింపుము కరివరదా
కరుణామయ, కరుణజూపు కంజదళాక్షా.

నీ సేవయె మా లక్ష్యము
నీ సేవకులైనవారి నిఖిలాఘమ్ముల్
బాసి తొలంగును భువిపై
వాసవనుత నిన్నుగొల్తు వందనమిదుగో

నీ సేవయె మాభకయము
నీ సేవయె మాకురక్ష నీరజనేత్రా
నీ సేవ మాకు పెన్నిధి
నీసేవే తరములెల్ల నిష్ఫలముహరీ,

స్వామీ ! రథసారథివై
నీ మఱదికి యర్జునునకు నిఖిలంబిడ వే
నీ మహిమ నేను పొగడెద
క్షేమంబు లొసంగుమయ్యా శ్రీ లక్ష్మీశా.

వందనము లోకపాలక
వందనమిదె స్వీకరింపు వనజదళాక్షా.
వందనము వేంకటేశా
సుందర చారిత్ర నిన్ను స్తోత్రముజేతున్

స్వామీ ! వేంకటరమణా !
నా మనవిని కాంచుమయ్యా నమ్మితి నిన్నున్
నీ మధుర పాదకంజ
శ్రీ మహిమను సన్నుతింతు తృప్తిమెలగుచున్

నిను ప్రార్థించెద నిరతము
నను రక్షింపుము మహాత్మనతుల నొనర్తున్
మణవాళ మహర్షిప్రియ
ఘనపూజ స్వీకరించు కాంచనచేలా

మృదుమధు శబ్దమ్ములతో
హృదయాంబుజమందు నిన్ను ప్రీతిని దనరన్
ముదమున కీర్తించెద, నా
పదలను రానీక బ్రోచి పాలింపుమిలన్

ఓం శ్శాంతిః శ్శాంతిః శాంతిః

శ్రీ ర స్తు

# మంగళాశాసనమ్

లక్ష్మీ హృదబ్జ భాస్కర
సూక్ష్మజ్ఞాన ప్రభావ శోభితరేఖా
లక్ష్మి శ్రీ శంఖాద్యా
భా, క్ష్మాధవ, దేవదేవ! భక్తశరణ్యా!!

జయజయ శ్రీ కమలనయన
జయజయ శేషాద్రివాస జయపరమేశా
జయ వేంకటేశ! శుభకర
జయజయ సరసీరుహాక్ష జయభక్తనుతా.

జయశ్రీధవ, మృదుచరణా !
జయజయ శ్రీ శ్రీనివాస జయశిఖరాగ్రా
జయజయ వినాశరహితా,
జయజయ శ్రీ మోహనాంగ! జయలక్ష్మీశా.

జయ జయ జగదాధారా!
జయసుందర మోహనాంగ, జయపరమాత్మా
జయ వసుదేవ కుమారా!
జయము జయము నీకు భక్తజన సంరక్షా.

నీపద పీయూషంబును
నేపలుమర గ్రోలువాడ నిర్మలమతినై
నీపరమ దేహ కాంతిని
నీపుడమిని చూడి చూచి నిత్యము మనుదున్.

పిడితి లౌకిక గుణముల
పీడితి బంధుజన చింత వేడుకతోడన్
పాడుదు పాటలు నీపై
పిడను నిరతంబు నిన్ను వేంకటరమణా.

జయ జయ గరుడా రూఢా
జయ గిరిధర నిర్మలాత్మ జయ పాపహరా!
జయభక్త కల్పవృక్షా!
జయ దశరథ తనయ నీకు జయము మహాత్మా.

నీకు సుమంగళ మిదుగో
శ్రీ కరుణకు భక్తజన వశీకరునకు, ల
క్ష్మీకర కంజగ్రహణా
లోక శ్రేష్ఠునకు మోక్షలోకేశునకున్.

జగములు నీలోనుండెను
జగతికి మంగళము నీదు చారు కరంబుల్
నిగమ మహోన్నతముద్రా
సుగమంబగు నీదు రూపు శోభిల్లు భువిన్.

దేవా! పీతాంబరధర!
దేవా ! పుష్పాయుధావి దివ్యధనంబున్
నీవే ధరించి యుంటివి
యావజ్జగదార్చితా, మహాత్మా! నమస్తే.

వచ్చితివట క్రీడార్థము
వచ్చితివట లక్ష్మిగూడి వరశుభతటికిన్
వచ్చితివట తిరుమలకును
వచ్చితివి వికుంఠపదము వదలి మహాత్మా.

సముపార్జిత కళ్యాణా!
సుమనోహర మౌనివంద్య సుందరదేహా
మము కృపజూడుము దేవా
కమలాక్ష జగన్నివాస కావుమనన్నన్.

నీ మంగళ హారమ్ములు
ప్రేమ ప్రపత్తి బుషులు, వివిధా చార్య
స్తోమము జదువుచునున్నది
ఈ మహి పాలించు మమ్మ నినకులదీపా.

గురుదేవ కృపాకలనన్
గురుతుగ రచియించినాడ కోమల భావా
కర సుప్రభాతమియ్యెడ
కరుణాకర తప్పులున్న కరుణింపు ప్రభూ

వెన్నెల గంట్యన్వయుడను
వెన్నుని కృపవలన భక్తి వేంకటరమణున్
సన్నుతి జేసెద నామం
బెన్నగ "లక్ష్మీనృసింహ" పృథ్వీస్థలిపై.

ఫలశ్రుతి

ఉదయంబున నెవరైనను
ముదమున నీ సుప్రభాతమును జదివినచో
సదయుని వేంకటరమణుని
పదపంకజార్చన ఫలంబు ప్రాప్తించు మహిన్

ఓం శాంతిః శ్శాంతి శ్శాంతిః
శ్రీ లక్ష్మి వేంకటేశ్వరార్పణమస్తు.
"సర్వేజనాః సుఖినోభవన్తు"
శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ వేంకటేశ్వర పరబ్రహ్మణే నమః

# సుప్రభాత దండకము

శ్రీ రామ! గోవింద! కృష్ణా! దయాకంద! గోపాల! బాలా! ముకుందా! మురారీ! సదా నంద! బృందావిహారీ! శుభాకార! నారాయణ ! వాసుదేవా ! జగన్నాథ! విశ్వేశ ! విశ్వంభరా ! వీర! కౌశల్యపుత్రా! హరీ! రాధికాస్వాంత హారీ! ధరాపుత్రికాచిత్తనీరేజభృంగా! శుభంగా! విభూ! మేలుకోస్వామి! వైకుంఠవాసా! దయామందిరా! స్వర్గ మర్త్యాది పాతాళలోకంబులన్! వేగ పాలింప లేవయ్య! శ్రీ వేంకటేశా! ప్రభూ! తూర్పు తెల్లారె. భానుండుతోతెంచె, అలమేలు మంగమ్మ! లోకం బులన్ గన్న లోకైకమాతా! మహాలక్ష్మి! శ్రీవిష్ణు వక్షంబు నందుండువేతల్లి! కల్యాణసౌందర్య రూపా! మముంబ్రోవవేవేగలేవమ్మమాయంద నుండమ్మ! శ్రీవేంకటేశప్రియా! దేవి! శాంతపు నీనెమ్మొగంబెప్పుడున్ చంద్ర బింబంబు వోలెన్ ప్రకాశించు వాణీ భవానీ శచీపూజలన్ గైకొనంగా జగన్మాత లేలెమ్మ పద్మావతీ తెల్లవారెన్ గదా వేగ భక్తాళినేలంగ రావే! శుభాకారిణీ!

పీతవాసా! మహాత్మా! మహాశక్తిరూపా! పరంజ్యోతి! అత్ర్యాది మౌనీంద్రులేతెంచి పద్మంబులన్ వేడ్కతో తెచ్చి పూజింప నున్నారు, శ్రీ శేషశైలేశ్వరా! వేగరే లెమ్ము, దేవేంద్ర రుద్రాది దేవాదులేతెంచి త్రైవిక్రమ స్ఫూర్తులన్ స్తోత్రమున్ జేయుచున్నారు వాణీశు డున్ నిన్ను శుద్ధిన్ పఠింపంగనున్నాడు వేదాంత వేద్యా! మముంబ్రోవగన్ నీవు లేవయ్య! మందారముల్ మంచి టెంకాయపోకల్ సుగంధంబు వీచంగ లేలెమ్ము! శారీ! శుకంబుల్ ఫలంబుల్ భుజించంగ నుల్లాసమున్ జెంది పాడంగ నీ దివ్య చారిత్ర దేవర్షిగానంబు సేయంగ నానంద మొందంగ లేవయ్య వెంకన్న! భృంగ గాళి ఝుంకారగీతంబులన్ గొల్చి నీ సేవ జేయంగ విచ్చేసెలేవయ్య! వ్రేపల్లె గోపాంగనల్ జిల్కు కవ్వాల మేల్ సవ్వడుల్ కుంభముల్ ఘోష సేయంగ, నోవెన్నదొంగా! దయాపాంగ! శ్రీకృష్ణ! లేలెమ్ము శ్రీ వేంకటాద్రీశ్వరా! స్వామి! మమ్మున్ గటాక్షింప రావయ్య! వేగంబె లేలెమ్ము శ్రీ శ్రీనివాసా! దయా వాస! శ్రీమంత! ధీమంత! లోకేశ! లక్ష్మీశ! కల్యాణ లీలా విలాసా! లసద్దివ్య సౌందర్యరూపా! మహాదేవ శ్రీశైలవాసా! మముంబ్రోవ రావయ్య తేజోవిరాజీ! శుభాకార! లేలెమ్ము దేవాదిదేవా సనందాది రుద్రాదులున్ బ్రహ్మదేవుండు శ్రేయస్సుకై వారు నీక్షేత్ర మందున్న శ్రీస్వామి కుండంబునన్ స్నానముంజేసి నీ ద్వారమున్ వేచియున్నారు శ్రీ వేంకటేశా శుభాకార లేలెమ్ము నీ స్థానవాసంబు శేషాచలంబున్ మహాత్మా! జగన్నాథ! శేషాద్రి నారాయణాద్ర్యాది నామంబులన్ పేరుకెక్కంగ పేర్కొంచు నున్నారు! శ్రీ వేంకటాద్రీశ్వరా! సుప్రభాతం బగున్ గాక లేలెమ్ము సేవా పర్వతంబునన్ శంభు-దేవేంద్రులున్, వహ్నికాలుండు, రక్షోవిభుం డబ్ధినాథుండు, వాయుండు, యక్షేశ్వరుండున్ మహా భక్తితో మౌళిపై అంజలింజేర్చి నిన్ జూడగా వేచియున్నారు లేలెమ్ము నాస్వామి! వాహ్యాళులన్ పక్షినాథుండు, స్వస్వాధి కారంబు యాచించుచున్నారు స్వామీ! మహాభాగ లేలెమ్ము సూర్యుండు చంద్రుండు భౌమాది సర్వ గ్రహంబుల్ జగన్నాథ! నీ దాస దాసాను భావంబునన్ దాసులై నిల్చియున్నారు లేలెమ్ము. నీ పాద పంకేజ ధూళిన్ శిరంబందు పూనంగ, స్వర్గాపవర్గంబులన్ గూడ చేపట్టగా బోక, రానున్న కల్పంబులన్ వింత మాహాత్మ్యమా మావంతయున్ కల్గబోదంచు నీ కల్పమందే భవద్దివ్య శక్తిన్ భజింపంగ కౌతూహలం బొందియున్నారు లేలెమ్ము నీ గోపురాగ్రంబులన్ దృష్టులన్నిల్పియానంద సమగ్నులై దేవ స్వర్గంబు మోక్షంబు లెక్కింపకేవేళ ఈమర్త్యలోకాన నిన్గొల్చు

భాగ్యంబు చేకూరు నం చిందె జన్మింపగా నెంచుచున్నారు శ్రీనాథ! లేలెమ్ము, ఓ భూమి నాథా! దయాసారసింధో! జగద్రక్షకా! దేవదేవేశ పక్షీశ! ముఖ్యార్చి తాం ఘ్రీ! రమా వల్లభా! సుప్రభాతమ్మగుంగాక! లేలెమ్ము శ్రీ పద్మనాభా! హరీ! వాసుదేవా మహా చక్రపాణీ! విభూ!మాధవా! దీనమందార! శ్రీవత్స చిహ్నాంకితా! వేంకటాద్రీశ్వరా! లెమ్ము లేలెమ్ము. కందర్పదర్పాపహంబైనసౌందర్యముప్పొంగు కల్యాణమూర్తీ రమానాథ! నెత్తమ్మిమొగ్గన్ తిరస్కారమున్ జేయు నీకాంత ఛందోయిపై దృష్టిగీలించి చెల్వొందు కల్యాణ రత్నాకరా! దివ్యకీర్తీ! ప్రపన్నార్తి హరీ! హరీ లెమ్ము, మీనాకృతీ! కూర్మరూపా! వరాహా! నృసింహాఖ్య శ్రీ వామనా! రామ! ఓ భార్గవా! రౌహిణేయా! యశోదాత్మజా! కల్కి ముఖ్యావ తారంబులన్ గాంచి లోకంబుగా పాడితో స్వామి లేలెమ్ము. శేషాద్రి! ఏలాల వంగంబు, కర్పూర గంధంబు, వాసించునాకాశ గంగోదకంబెల్ల భాండంబులన్ దెచ్చి నీ సేవలన్ జేయగా వైదికాగ్రణ్యులల్లంతటన్ హృష్ట చిత్తంబులన్ నిల్చియున్నారు లేలెమ్ము. భానుండు రానుండె కెందామరల్ విచ్చె, పక్షిధ్వనుల్ దిక్కులన్ బర్వె శ్రీవైష్ణవుల్ గీతముల్ బాడ నిల్చుండి యున్నారు నీ సన్నిధిన్ మంగళప్రాప్తికై స్వామి లేలెమ్ము. సుప్రభాతంబగుగాక, బ్రహ్మాది దేవావళుల్ సప్త మౌనుల్ సదానందాదియోగేశ్వరుల్ మంగళాపాది వస్తూత్కరంబున్ కరాబ్జంబులన్ బూని నీమందిర ద్వారసీమన్ మహాభక్తితో వేచియున్నారుస్వామీ! దయాభూమి లేలెమ్ము కల్యాణసింధూ! భవాంభోనిధిన్ దాటు మార్గంబుజూపించు వేదాంతవేద్యా సదాభక్తభోగ్యా ప్రభావా! ప్రభాతంబు మేల్కొల్ప వచ్చెన్ పడిన్ లెమ్ము దేవేశ్వరా, సుప్రభాతంబగుంగాక లే లెమ్ము మేల్కొమ్ము భక్త్యానతున్ నన్ను పాలింపగారమ్ము ఈ సుప్రభాతమ్మునే మానవుల్ భక్తిసంపూర్ణులై నిత్యమున్ సుప్రభాతంబునన్ వేంకటేశా, పఠింతోర్ సదా వార కవ్వారిగా, మోక్షమందన్ మహాప్రజ్ఞ చేకూరు తథ్యంబు శ్రీదేవ దేవాదిదేవా, నమస్తే, వృషాద్రీశనాథా, రమాతుంగ వక్షోజసంలగ్న కాశ్మీరచర్చా, నవారుణ్య విభ్రాజి నీలాంగ, కెందమ్మి పూరేకులన్ బోలు నిద్దంపుకందోయి వెల్గొందుసామీ, జగన్నాథ, నీకునీ జయంబే, జయంబౌ, పయోజాతగర్భేశ, షడ్వక్త్ర ముఖ్యామర వ్రాత చూడామణీ, సాధుసంరక్షకా, వేదసారా, హరీ, నన్ను రక్షింపుమయ్యా, విభూ, హద్దులన్ మీరి పెంపొందు ఘోరాపరాధంబులన్ పెక్కు కావించితిన్, పెక్కు మారుల్, దయాదృష్టి నీదుష్టునిన్ వేగకాపాడుమయ్యా, జనుల్గోరునద్దాని కన్నన్ ప్రసాదింతువత్యంత మౌదార్యలీలన్ సదానిమ్ము సర్వాగమంబుల్

మహాదైవమంచున్ నుతించున్ రమాచంచలాక్షీప్రియా! ఒల్లనేనన్యునీకంటె
గోపాలబాలా, మనోనాథ, వేణుధ్వనుల్ పర్వగా గోపికల్ వేనవేల్ పారవశ్యం
బునన్ నిన్ను సేవించుచున్నారు హేకోటికందర్ప లావణ్యరాశీ, మహానందమున్
గూర్తు గోపాంగనా జాతికేనొల్ల నీకంటెనన్యంబు కల్యాణధామా, ధనుర్ధారిచూడా
మణీ, రాఘవా, స్వామి, దేవాదిదేవా, దయాసాగరా, మమ్ము కాపాడుమయ్యా
వరంబుల్ ప్రసాదించి, లక్ష్మీపతీ, నీవు సీతామహాదేవికిన్ మోహమున్ గూర్చు
నందంపు నాథుండవయ్యా, చంద్రబింబంబుడంబంబు తూలించు నెమ్మోముసామీ,
దశాస్యాతి గాఢాంధకారంబు మాయించు చండార్కమూర్తీ, రఘూత్తంస, నిన్నే
మదిన్ వేడుచున్నాను శ్రీరామచంద్రా, త్వదీయాంగమున్ నెమ్మొగంబున్
కడున్ సుందరంబౌ మనస్సెన్నగా వెన్నయౌ, సర్వభక్తాళికిన్ నీవు నిత్యా
శ్రయంబైన కారుణ్యవారాశివయ్యా, జనాధీశ్వరా మంచి తోబుట్టువుల్ గల్గి
పేరొందు పెద్దన్నవయ్యా, యమోఘంబు నిర్వందమై యొప్పు బాణావళిన్ దాల్చు
వీరుండవయ్యా, నినున్వీడి వేరొక్కనిన్ నేను సేవింప
నీకన్న నాకెవ్వరున్ దిక్కులేరయ్య ఎల్లప్పుడున్ వేంకటేశున్ స్మరింతున్
ప్రసన్నుండవై ప్రీతి చేకూర్చుమయ్యా, ప్రభూ, వేంకటేశా, భవత్పాదపద్మైక
సంసేవకై నిన్ను నే గొల్చుచున్నాను. స్వామీ! సకృత్సేవచే నిన్ను నిత్యంబు
సేవించు సేవాఫలంబున్ ప్రసాదించుమా శేషశైలాగ్ర చూడామణీ నేను
మూఢుండనై చాలనేరంబులన్ చేసితిన్ వానినన్నింటి సైరించి మన్నింపుమయ్యా
ననున్ శ్రీహరీ, భక్తగమ్యా నమస్తే, సమగ్రంబుగా పూర్తిగావించితిన్ స్తోత్ర
మున్ దేవ, యాలింపుమయ్యా, మహావిష్ణవౌ వేంకటాద్రీశ వక్షస్థలంబందు
నిత్యంబు వెల్గొందు తల్లిన్ జగన్మండలాధ్యక్షురాలిన్ సరోజాతభూషా, కరాబ్జన్
మహాపద్మసింహాసనాసీన వాత్సల్య నిత్యోజ్జ్వలన్ తల్లి నిన్నున్సదా గొల్చెదన్,
వేంకటేశా! విభూ, నీవుకారుణ్యవారాశివయ్యా, జగజ్జాలమున్ సృష్టి గావించి
పోషించు దక్షుండవయ్యా, మహాచేతనాచేతనా రూపమౌనీ ప్రపంచంబునందున్
ప్రధానుండవయ్యా సదానుస్వభావంబునన్ వెల్గుదాసాళికిన్ పారిజాతంబవయ్యా,
హరీ, దేవ, నీపాదపద్మంబులే యాశ్రయింతున్ సుగంధంబు గుప్పించు మేలైన
పూదండలన్ తావిచేకూర్చు నీపాద పద్మంబులన్ చూచి చిత్తంబు నిత్యంబు
తత్సేవకై కౌతుకంబూను నీ పాదపద్మంబులే రక్షగా నమ్ముకొన్నాడనయ్యా,
విభూ, క్రొత్తగా విచ్చికెంపుల్ దువాళించు కెందమ్ములన్ బోలు నీపాదపంకేజ

ములన్ వేడుచున్నాను, మత్స్య ధ్వజాం భోజచక్రాంకుశచ్ఛత్ర శంఖాది కల్యాణ రేఖల్ విరాజిల్లు నీపాదపద్మంబులన్ వేడుచున్నాను. శ్రీపద్మ రాగప్రభల్ వెల్గుచున్నట్టి నీపాదపద్మంబులన్ గొల్తు శ్రీ శ్రీనివాసా, రమాదేవి, కేంగేళితో మెత్తగా నొత్తగానప్పుడే కందునేమోయటన్నంత మెత్తందనం బొప్పు నందంపు నీ పాదముల్ చిక్కగా నమ్మియున్నాడ, శ్రీదేవి, భూదేవి, నీలా మహదేవియున్ పాదసం సేవ చేయంగ నవ్వారి కెంపారు హస్తాల యెఱ్ఱందనంబుల్ ప్రకాశించునో యన్న చందాన శోణప్రభల్ వెల్గు శ్రీ వేంకటేశాంఘ్రి యుగ్మంబు నాకున్ శరణ్యంబుగున్ నిత్యమున్ మ్రొక్కి ధాత్రీశముఖ్యామర వ్రాత మౌళిచ్ఛటారత్నకాంతుల్ మహా హారతుల్గా విరజిల్లు శ్రీ వేంకటాద్రీశు పాద ద్వయంబులే శరణ్యంబుగా వేడుచున్నాడ నో వేంకటేశా, రమానాథ ఋగ్వేద మందున్ మహోత్కృష్ట మైనట్టి వైకుంఠ ముందున్న క్రొందేనయున్, సూక్తికిన్ తావలంబైన నీపాద యుగ్మంబునే చిక్కగా నమ్మియున్నాడ, పూర్వంబునన్ పార్థ సారథ్యమున్ బూనినన్నే శరణ్యంబుగా నమ్మమంచీవునా క్రీడికిన్ చూపియున్నట్టి యాపాదయుగ్మంబు నీచేత చూపించుచున్నావు తత్పాదపద్మంబు దిక్కంచు ప్రార్థించుచున్నాను శ్రీ వేంకటాద్రీశ్వరా ! పాపినౌ నాదు శీర్షంబునన్ భోగిభోగంబులన్ వేంకటాదీంద్ర దుర్గాటవిన్ వేదవేదాంత భాగంబులన్ యోగనిష్ఠాగరిష్ఠాత్ములౌ యోగిచిత్తంబులన్ సర్వదాయుంచు నీదివ్యపాదద్వయం బున్ శరణ్యంబుగానమ్మి యున్నాడ నిత్యంబునమ్లాన పుష్పంబులన్ వెల్గుచున్ వేంకటాహార్యశృంగాగ్ర భూషాస్థితిన్ కుల్కుచున్ సర్వలోకంబున్ సంతతానందమున్ గూర్చుచున్ కాంతి జెన్నారు నీదివ్యపాదంబులన్ వేడుచున్నాడ, భక్తాళికిన్ తొట్టతొల్తన్ మహాభక్తితో చూడగా నొప్పుచున్ బిడ్డకున్ తల్లిచన్ బాలలీలన్ సుధాతుల్యమై సామ్యమేలేక వెల్గొందు నీదివ్య పాదాబ్జముల్ వేడుచున్నాడ. నోదేవ దసత్వప్రధానుల్ సదాకొల్వ సంసారవార్ధిన్ దయన్దాటగా జేయు మేల్ జల్లులోచల్లనౌ చూపులొప్పారు నోదేవ! యారమ్యజామాతచే (మణవాళమహామునిచే) చిక్కగాచూప భాసిల్లు నీపాదపద్మంబులన్ వేడుచున్నాడనో శ్రీనివాసా! మహాముక్తికిన్ నీవు సత్సాధనంబై వెలుంగున్ జగన్నాథ సంధానకత్వంబు చేబూను నీవే మొప్రాప్యుండవై యుండగా నామె సర్వాభిగమ్యాస్థితిన్ బూను నాదేవితో సర్వదా కూడియున్నట్టి సిద్ధం పుసంపత్తి భాసిల్లు నీకైన

మోహకముల్ గూర్తు నీదాసదాసుండనై సర్వదా నిత్యకైంకర్య భావంబునన్ కేలుయోడ్తున్ విభూ ! యీ ప్రపత్తిన్ మదిన్‌మెచ్చి నన్నేలుకో నిత్యకల్యాణ దాయీ నమస్తే ! రమాదేవికిన్ భర్తయై సర్వ కళ్యాణ సంపత్తి నిక్షేపమై పేద వర్గాలకున్ పెన్నిధానంబునై వేంకటాద్రిన్ వెలుంగొందు చిన్మూర్తికిన్ మంగళం బౌత ! లక్ష్మీ సతిన్ విభ్రమం బొప్పుమాడ్కిన్ సదాచూచుచున్ సర్వలోకాలకున్ నేత్రరూపంబునన్‌వెల్గు శ్రీ వేంకటస్వామికిన్ మంగళంబౌత! శ్రీ వేంకటాద్రేంద్ర శృంగాగ్రమాంగళ్య భూషాకృతిన్ వెల్గు పాదంబులన్ సొంపు నింపారుచున్ సర్వకళ్యాణలీలా స్పందంబైన శ్రీకామికిన్ మంగళంబౌత ! సర్వాంగ సౌందర్య సంపత్తిచే లోకజాలంబు మోహింపగా జేయు శ్రీదేవతామూర్తికిన్‌మంగళం బౌత! సర్వజ్ఞుడై సర్వసామర్థ్య సంపన్నుడై సర్వలోక ప్రధానుండునై నిత్యసౌశీల్య సౌలభ్య వాలభ్యమున్ గొన్న సప్తాద్రి వేంకన్నకున్ మంగళంబౌత ! తానే పర బ్రహ్మ రూపలబునన్ పూర్ణ కాముండనై సత్యతత్వాత్ముడై శీవినాప్పారు మా స్వామికిన్ మంగళం బౌత!కాలంబుసుంతేని గుర్తింపగాబోక ఎల్లప్పుడున్ స్వీయ మూర్తిన్ విలోకించు భక్తాళికిన్ నవ్య నవ్యామృతంబైన భూభర్తకున్ మంగళం బౌత । సర్వ ప్రపంచాలికిన్ రక్షగాగా స్వకీయాంఘ్రి పద్మంబులన్ పాణిపద్మం బుతో చూపు శ్రీభార్గవీవేనేతకున్ మంగళంబౌత। కారుణ్య సారామృతంబుల్ తరంగంబులై యెప్పుకృంజల్వ చూపుంగమిన్ సర్వ సర్వ ప్రపంచంబులన్ జల్లి గాజేయు కారుణ్య వారాశికిన్ మంగళంబౌత । తాదాల్చు పూమాలకున్ సొమ్ము కున్ పీత వస్త్రాళికిన్ శోభ చేకూర్చు శృంగార దేహంబునన్ వెల్గుపీడా పరిహా రకుండైన శ్రీ స్వామికిన్ మంగళంబౌత !వైకుంఠరక్తిన్ విసర్జించి యీసామి కోనేటి తీరంబునన్ లచ్చితో లీలమీరన్ విహారంబులన్ దేలు శృంగారికిన్ మంగళంబౌత ! శ్రీరమ్యజామత చిత్తంబునన్ -సర్వలోకంబులన్ నిండియున్నట్టి శేషాద్రికిన్ మంగళంబౌత! యీ మంగళాశాసనంబున్ సదాచేసి సన్ముక్తిగైకొన్న మా పూర్వులాచార్యులత్యంత భక్తి ప్రబత్తిన్ భజింపంగ కల్యాణ రూపంబునన్ భక్తి నీ దండకంబుల్ పఠింపన్ దలంపూను భక్తాళికిన్ శ్రేయముల్ గూర్చు సర్వాత్మకున్ మంగళంబౌత! హరీ! వేణురావంబు కర్ణంబులన్‌సోకి పాపంబులన్ డుల్చు నీనామ పారాయణా సక్తచిత్తుండ నైయుంటీ చండప్రచండాఘ సంఘాత మున్ ధ్వంసమున్ జేయగాజాలు నీ పుణ్యనామంబు నీ దివ్యరూపంబు, నీ వేణు

నాదంబు నీ శంఖచక్రాద్యనేకాయుధాశేష పుజంబు నా ముందు రంజిల్లగా జేయవే దేవ ! యుష్మత్కృపాపూర్ణ సాక్షాచ్ఛుభానంద సందోహ సౌందర్య సంపత్ప్రసాదంబు నానొప్ప శ్రీకల్పవృక్ష ప్రసూనాని లాఘ్రాణమున్ మాకు జేకూర్చు మయ్యా, భవద్భక్తి లక్ష్యాను సంధాన సంయుక్తసంపన్మహార్తాను వర్తిత్వ దైనందినాభ్యాస సంగీత సంశోభితోపాసనా శీలురన్‌గామమున్ జేయు మయ్యా విభూ ! స్వామి! లక్ష్మీ నృసింహాఖ్యుడన్ తప్పులన్నీవు మన్నింపు మయ్యా నమస్తే! నమస్తే! నమః

N. B. : మీ పేరును జేర్చి చదువుకొనుడు.

## శ్రీ వేంకటేశ్వర "వైజయంతి"

# సుప్రభాత దండక మాహాత్మ్యము

శ్రీ వేంకటేశ్వర సుప్రభాతమను స్తోత్రము దండకరూపమున రచించి స్వామివారికి అలంకారమగు వైజయంతిమాలికా నామధేయమున అమరించితిని. అందు సుప్రభాతము, స్తోత్రము, ప్రపత్తి, మంగళాశాసనము అను నాలుగు విధములుగా నున్నవి. శ్రీ మదఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుండును, కలియుగ దేవుండును. అలమేల్మంగా రమణుండును మదీయ సుమంగళ గీతా నాథుండును, శ్రీవేంకటేశ్వరుని నిద్రనుండి మేల్కొలుపు స్తోత్రము దండక రూపములో నున్నది.

ప్రాతఃకాలమున బ్రహ్మరుద్రాది సమస్త దేవతలు, అష్టదిక్పాలకులు, నవగ్రహములు, నారద, తుంబుర, సనకసనందనాది మహర్షులు నారాధనకై ద్వారమునందు పడిగాపులై వేచియుండి శ్రీహరి దివ్యవైభవమును గొనియాడుచు నుందురు. అట్టి దివ్యమంగళ విగ్రహుని ప్రాతఃకాలమున పఠించు భక్తులకు మాయచే గప్పబడిన అజ్ఞానము తొలగి జ్ఞానము కలుగును. ఆజన్మాంతర పాప శేషంబు తొలగి భగవంతుని దయకు పాత్రులగుదురు.

కావున భక్తులు, పండితులు, కవులును పామరుడనగు నన్ను కరుణించి తప్పులున్న తెలిపిన తదుపరి యైదవ ముద్రణలో సవరించుకొందును.

ఇట్లు
స్వామివారి సేవకుడు
గ్రంథకర్త



# -: ఓంకార మహిమ :-

"ఓమ్ స్మర" – ఓంకారమును స్మరింపుము

'ఓం' కారమనగా (ఎ) అంతట వ్యాపించునది యనియు (బి) సంసార సముద్రమునుండి రక్షించునది యనియు నర్థము. 'ఓం' కారమునే ప్రణవమని యందురు.

'అ' కార 'ఉ' కార 'మ' కారములు 'ఓమ్' సర్వవేదములు దేనిని వచించుచున్నవో, సర్వతపస్సులు దేనిని ప్రకటించుచున్నవో, దేనిని వాంఛించి నరులు బ్రహ్మచర్య లాచరింతురో అది 'ఓమ్', 'ఓమ్' సమస్త విశ్వములేక భగవంతుని సూచించు నామము; బాహ్య ప్రపంచమునకును, ఈశ్వరునకు నడుమనిలిచి అది రెండింటిని నిలుచును.

ఈ విశ్వమునకు సహస్ర సంఖ్యలుగల విశ్వములుగా గ్రహింపగలము. ప్రత్యేక విశ్వము సమగ్రమై ప్రత్యేకమైన నామముతో, రూపముతో, భావముతో వెలయును.

ఈ భావములు ప్రతీకములు, ఒక్కొక్కదాని కొక్కొక్క పేరు కలదు. ఈ పేర్లు పవిత్ర చిహ్నములను సూచించును, అవి భక్తి యోగమున "వ్యవహరింపబడుచుండును. ఇంచుమించుగా వాని కనంత శక్తి గలదు. ఈ శబ్దములను పునశ్చరణ మొనరించినంతనే మనము దేనిని కాంక్షించిన దానిని పడయగలము.

ఈశ్వరునకు బహుళ నామములు గలవు. ఈ నామములన్నియు ఆ పరాత్పరునివే. ప్రతిదానియందు నాతని యనంత శక్తి విద్యమానమైయున్నది

ఈ నామ పురశ్చరణ మొనరించుటకు కాలములేదు, స్థలములేదు. ఏలయన సర్వకాలములు, సర్వస్థలములును పవిత్రమైనవే. ఆ ఈశ్వరుడు సులభుడు దయాళుడు; అట్టి పరమేశ్వరుని ప్రేమింపని మన మెంత దురదృష్ట వంతులమో గదా!

ఓంకారంబే బ్రహ్మము
ఓంకారంబుననె జగము లుద్భవమొందున్
ఓంకారమందె శ్రీయును
ఓంకారంబే త్రిమూర్తి యుతమని కనుడీ.

ఓంకారమే బ్రహ్మము, ఓంకారము స్వయం సిద్ధమైన పరమేశ్వరుని నామము. మహర్షులు సమాధ్యవస్థను పొంది పరబ్రహ్మను సాక్షాత్కరించు కొన్నపుడు ప్రకృత్యతీతమైన నాదము గుర్తింపబడును. ఆ నాదమే 'ఓమ్' కారము, అదియే నాదబ్రహ్మము. ఓంకారసహిత మంత్రోచ్చారణమే ముఖ్యము.

ఓంకారమును ప్రణవమనియు నందురు. ప్రణవమునుండి యే సమస్త శబ్దములు, సమస్త మంత్రములు ఏర్పడుటచేత ఓంకారము సర్వ మంత్రములకు హేతువగుచున్నది (కారణమగుచున్నది).

ఓంకారమును స్మరించిన మాత్రమున బ్రహ్మజ్ఞానమున పరాకాష్ఠ నంది యమరత్వమును మోక్షమును పొందును.

ఓంకారము స్మరించుటచేతను, కీర్తించుట చేతను, పరబ్రహ్మము పొందును. కావున ఓంకారమును స్మరింపుము. శ్రద్ధాభక్తులు కలిగియుండవలెను.

ఓంకార ముచ్చరింపక, చేసినదంతయు వ్యర్థమే. అందుచేత ముందు ఓంకార ముచ్చరింపవలెను.

ఓంకార రహితముగ చేసిన హోమము, యజ్ఞము మొదలగు సమస్త కర్మములు నిష్ఫలమగును.

ఓంకారము నాశన రహితమైన పరబ్రహ్మగ నెఱుంగవలెను.

అవిచ్ఛిన్నమగు తైలధారవలెను దీర్ఘమగు ఘంటా నినదమువలెను నిరంతరము ప్రణవ ముపాసించువాడే బ్రహ్మవేత్త.

ఓంకారమునకు పందొమ్మిది (19) అర్థములు కలవు.

(1) రక్షణ (2) గతి (3) కాంతి (4) తృప్తి (5) అవగమ (6) ప్రీతి (7) ప్రవేశ (8) శ్రవణ (9) స్వామ్యర్థ (10) యాచన (11) క్రియ (12) ఇచ్ఛ (13) దీప్తి (14) వ్యాప్తి (15) ఆలింగన (16) హింస (17) దాన (18) భోగ (19) వృద్ధి అను పందొమ్మిది అర్థములు కలవు.

1. సంసార సముద్రమునుండి రక్షించునది సర్వకాల సర్వావస్థలయందును సర్వ్య విషయముల యథార్థ్య మెఱుంగును.
2. ఎల్లప్పుడు సంసార చక్రము నడుపును.
3. వ్యాపకత్వముచే అన్నిచోట్ల ప్రకాశించుచు అందఱకు లభ్యమగును. విశ్వమును జ్ఞానముతో నడిపించుటకు ప్రయత్నించును. ప్రపంచము ప్రకాశింపచేయును.
4. ఆనంద స్వరూపమగుటచేత భక్తుల నానంద పరచును.
5. భక్తులను తృప్తి పరచును.
6. సమస్త ప్రాణుల మనోభావములు సర్వదా సర్వత్ర అవగతము చేసి కొనును
7. సూక్ష్మరూపి యగుటచేత ఆత్మరూపమున సమస్త ప్రాణులయందును, ప్రవేశించును.
8. శ్రోత్రేంద్రియ నిర్మాతయగుటచేత, రహస్యమైన స్థూల సూక్ష్మ శబ్దముల నాలకించును.
9. చరాచర ప్రపంచమును ప్రభువై శాసించును.
10. ఐశ్వర్యయుక్తుడగుటచేత అందఱూ యాచింపదగిన స్థానము.
11. క్రియాశీలమైన ప్రపంచము నిర్మించి ప్రవర్తింపజేయును.

12. తాను కోరికలు లేనివాడైనను, సమస్త ప్రాణుల శుభవాంఛలు నెర వేర్చును.

13. జ్ఞానస్వరూపి యగుటచేత అజ్ఞానాంధకారములు నశింపజేయును.

14. ఇంద్రియాతీతమైన పరమాణు రూపి యగుటచేత అంతఃకరణమునకు మాత్రమే గోచరించును.

15. వ్యాప్యవ్యాపక భావముచేత సర్వసంబంధియై యుండును.

16. వైదికమార్గ ప్రవర్తకుల అజ్ఞానము నాశనము చేయును.

17. సృష్టికాలమునుండియు శుభప్రదమైన పదార్థము ఉపయోగించు సద్బుద్ధి నిచ్చును.

18. ప్రళయకాలమున స్థూల జగత్తును తనలో లీన మొనరించుకొనును.

19. సృష్టికాలమున సూక్ష్మ ప్రకృతిని స్థూల ప్రకృతిగ తెచ్చును.

ఓంకారమునకు చెప్పబడిన యర్థము లన్నియు, గుణములన్నియు ప్రణవో పాసకులకు లభించును. అందుచేతనే ప్రతి మంత్రమునకు, మొదట ఓంకార ముచ్చరింపబడును. అట్లే గాయత్రీ మంత్రమునకు కూడా మొదట నోంకారము చేరియున్నది.

ఓం భూర్భువ స్సువః
తత్స వి తుర్వరేణ్యమ్
భర్గో దేవస్య ధీమహి
ధి యో యోనః ప్రచోదయాత్.

[ఓమ్ భూః భువః స్వః తత్ సవితు. దేవస్య వరేణ్యం భర్గః ధీమహీ యః నః ధియః ప్రచోదయాత్.

బిందు సంయుతమైన యోంకారమును యోగులు నిరంతరము ధ్యానిం తురు. కోరికలను మోక్షమును ప్రసాదించెడి యోంకారమునకు నమస్కారము.

ఓంకారము నుపాసించుటచే భగవత్తత్వము తనలో పెంపొందును. స్వయంసిద్ధమగు నీశ్వర నామము నూతగా గొని మానవుడు భగవత్సన్నిధిని

చేరును. పరబ్రహ్మ స్వరూపమగు ప్రణవము నుపాసించిన సాధకుడు మోక్షము నందును.

ఓంకారమును భక్తి శ్రద్ధలతో జపించిన యెడల ఓంకారమునకు గల మహిమలు, శక్తులు మొదలగునవి సిద్ధించును.

బ్రహ్మ యునికి లేనిదే ప్రపంచముల యునికి సంభవము కాదు కనుక నిస్సంశయముగ నది బ్రహ్మ స్వరూపమే.

భూరూపి విష్ణు- భువోరూపిణి లక్ష్మి- వారి యుభయుల దాసుడైన జీవుడు స్వారూపి.

"ఓ"మ్మనునది యక్షర బ్రహ్మము. అది సూక్ష్మపదార్థముల కన్నను నశింపనిది. అది యష్టార్థకము అనగా నెనిమిది స్వరూపములు గలది యని యర్థము.

అ కారము మొదటి యక్షరము, ఉ కారము రెండవ యక్షరము మూడవ యక్షరము మకారము, బిందువు నాలుగవ యక్షరము. నాదము పంచమాక్షరము. ఆరవ యక్షరము కళ కళాతీతము (7) సప్తమాక్షరములు, ఎనిమిదవ యక్షరము తత్సరము తరింపజేయునది గాన తారకము. ఆ తారకమే బ్రహ్మము అదియే యుపాసింపదగినది.

'అ' కారమువలన నుండి జాంబవంతుడు 'ఉ' కారమునుండి సుగ్రీవుడుగా ఉపేంద్రు డావిర్భవించెను. 'మ' కారాక్షరము నుండి శివుడు వాయురూపమునుండి కేసరి క్షేత్రమందు (కేసరి యనువాని భార్యయగు నంజనాదేవియందు) పుత్రుడుగ నుద్భవించిన హనుమంతుడు 'మ' కార కభిదేయుడని నుడివెడు రామతారకోపనిషత్తు "హనుమాన్ రుద్రబీజః" ఆంజనేయుడు రుద్రవీర్యమునకు బుట్టినవాడు ''మకారాక్షర సంభూతః శివస్తు హనుమాన్ స్మృతః (దుర్వాసరామాయణోక్తి) అని సంబోధించుచున్నది.

''అకారాది కకారాంతములగు నేబది వర్ణములకు నధిష్ఠాన దేవతలు కలరనియు 'ర'కార మగ్నిబీజమనియు, 'అ' కారము సూర్యబీజమనియు 'మ' కారము చంద్రబీజమనియు, మంత్రశాస్త్రము నిర్వచించును, అజ్ఞానమును నంధ

కారమును బొఱల్ద్రోలునది జ్ఞానప్రకాశము, ఆ ప్రకాశమున కధిష్ఠాన దేవత సూర్యచంద్రాగ్నులు వారికి బీజములు 'ర' కార 'అ' కార 'మ' కారములు. అందుచే నామూడు వర్ణములతోఁ గూడిన రామనామ మగ్ని సూర్యచంద్రులకును హేతువని వచింపబడినది.

అగ్ని శివరూపము, సూర్యుడు విష్ణురూపము, చంద్రుడు బ్రహ్మరూపమని పురాణ ప్రసిద్ధి. అందుచేత రామనామము త్రిమూర్త్యాత్మకము. అది రకార అకార మకారాత్మమై ప్రణవమునకు మఱియొకరూపమని తత్త్వవేత్తలు పలుకుదురు, అందుచే తారకము ప్రణవసహితముగ లేదు, ప్రణవము వేదముల కాద్యవర్ణమై నందున ప్రణవ స్వరూపమైన రామనామము వేదములకాధారమైనది త్రిగుణాతీత జ్ఞానమే రామస్వరూపము గావున నిర్గుణము, యజ్ఞానహరణము; ఆనంద సంధాయకత్వాది గుణములు కలది. గాన రామనామము సర్వసుగుణరత్న సాగరము."

ఓం తత్సత్

సర్వద్యోతనాత్మకే ఆత్మని పరమేశ్వరే (మహీధరుడు)

తా॥ అన్ని ప్రకాశములకును, ఆత్మలకును, దేవతలకును, పరమేశ్వరునకును, దేవశబ్దము ప్రయోగింపబడును.

శ్లో॥ దీవ్యత్యే క్రీడతే యస్మా । ద్రోచతేద్యోతతేపిని
తస్మాద్దేవ ఇతి ప్రోక్తః । స్తూయతే సర్వదైవతైః॥
"రజ్వాకారాద్దీవ్యతి, ప్రకాశ యతీతిదేవ, ధ్యాతృహృదయార
వింద మధ్యేక్రీడతీతిదేవః । దీవ్యతినందయతీతిదేవ।"

భగవదవతారము లనంతములు, లీలలద్భుతంబులు, భగవంతువడు షోడశకళాపరిపూర్ణుండయి చరణోరుభుజముఖ శ్రవణాక్షినాసాశిరంబులు పెక్కు సహస్రంబులయి వెలుంగ, పీతాంబరధరుండును, కేయూరహారకుండల కిరీటాదులనంత కోటి భాస్కరదీప్తి దేజరిల్ల క్షీరసాగరశయనుండు, భక్తవత్సలుండు కరుణానిధియయి వెలుంగు శ్రీమన్నారాయణు దివ్యరూపంబు సకలావతారమూలంబగు యాదిమావతార ఇద్దాని ననవరతము పరమయోగీంద్రులు దర్శించి యానందాబ్ధి నోలలాడు చుందురు.

కం. హరిమయము విశ్వమంతయు,
హరి విశ్వమయుండు సంశయము పని లేదా
హరి మయముగాని ద్రవ్యము
పరమాణువు లేదు వంశపావనవింటే॥

(ఆం.భాగ. 2 స్కం.)

నారదుండొకసారి బ్రహ్మదేవునియొద్దకు వెళ్ళి. సాష్టాంగదండప్రణామము నాచరించి, షోడశోపచారంబులం బూజించి, 'దేవా : పదునాలుగు లోకములకు యధిపతివి నీ వేనా ? లేక మరియొక యధిపతి గలడా ? శ్రీమన్నారాయణదేవు లీలావతారము లెట్టివి ? దేవదేవుండే యవతారములను దాల్చెను? అమ్మహాత్మ్యన వతారము లేవి? తెలుపమని ప్రార్థింప కమలాసనుడు చిరునవ్వు ముఖముగలవాడై నారదా ! పదునాలుగు లోకములకు నాథుఁడు శ్రీమన్నారాయణ దేవుఁడు. ఆద్దేవ దేవు నానతి నీసకల భువనములు జనియించును. అతని యాజ్ఞానువర్తినై నడుచు కొందును. మహేశ్వరాది సకల లోకపాలురు, మనువులు, ప్రజాపతులు, వారు

వీరననేల సకల చరాచర జీవకోటియు నాతని సేవింతురు. అమ్మహాదేవు కనుస న్నల మెలంగుదురు. లోకనాథుండు లోకకర్త యమ్మహాదేవదేవుండు, అద్దేవదేవు లీలావతారముల నాదిశేషుండు నేనునుదప్ప యెవరును తెలియంజాలరు; దేవదేవు లీలావతారముల గణియింప మా యిర్వురకేనియు నసాధ్యము. అయినను నీ యొక్క సందేహమును నివారించుటకు నాకు తెలిసినంతవరకు నెఱింగింతును. దేవదేవుల లీలలు లెక్కింపనలవిగానివి అందు (1116) వెయ్యి న్నూటపదునారు నవతారములుత్తమములై యొప్పు. అందు (96) తొంబదియారు శ్రేష్ఠము లనం దగును. ఇందు (27) యిరువదియేడవతారములు ప్రసిద్ధములైనవి. ఇందు (21) యిరువది ఒక్క యవతారములు ప్రశంశనీయమైనవి. ఇరువది యొక్క యవతార ములలో (మత్స్య. కూర్మ వరాహశ్చ నారసింహశ్చ వామనః రామోరామశ్చరా మశ్చ కృష్ణః కల్కిరేవచ) 1. మత్స్యావతారము, 2. కూర్మావతారము, 3. వరాహావతారము, 4 నరసింహావతారము, 5. వామనావతారము 6. పరశు రామావతారము, 7. శ్రీరామావతారము, 8. బలరామావతారము, 9. కృష్ణా వతారము. 10. కల్క్యావతారములు శ్రేష్ఠములైనవి దశావతారములలో శ్రీరామ, శ్రీ కృష్ణావతారములతి శ్రేష్ఠములైనవి.

శ్రీహరి వైకుంఠమును వీడి శంఖ చక్రరమాద్యనంత పరివారసమేతంబుగ నయోధ్య నవతరించెను. శ్రీరామావతార మతిశ్రేష్ఠంబనియు. పూర్ణావతారమనియు చెప్పబడెను.

శ్రీమన్నారాయణుండు సకల సపరివార సమేతంబుగ వైకుంఠమును వదలెను.

శ్రీ కృష్ణావతారమున భూలోకమున నవతరింప నవసరము లేకుండుటయు నిజాంశ బలరామ శ్రీకృష్ణాదు లిర్వురు భూభారహరణార్థము భూమియం దవత రించిరి. శ్రీ కృష్ణావతార మంశావతారము. ఏడవమనువగు వైవస్వత మన్వంత రమున (27) యిరువదిఏడు మహాయుగములు గడచి (28) యిరువదిఎనిమిది మహాయుగాంతర వర్తమాన కలియుగాంతమున శ్రీ కాళయుక్తినామ సంవత్సర చైత్రశుద్ధ ప్రతిపత్యాది నాల్గులక్షల ఇరువదియారువేల తొమ్మిదివందల యేబది రెండు వర్షంబులు సనశంబల గ్రామంబున వేద వేదాధ్యయన సపన్నుండును,

బ్రహ్మనిష్ఠాగరిష్ఠుండును, విష్ణుశర్మ నామంబున దనరుభూసురోత్తమునకు దేవ ప్రభ యను మహాపతివ్రతా సతీమణియందు కల్కి-మూర్తి సంజ్ఞ విష్ణుదేవు డవతరించి తురగారూఢుండయి, యిమ్మేదినీ చక్రంబు గ్రుమ్మరి నిజఖడ్గధారల దుష్టుల వధియించి యధర్మము యన్యాయాదుల నడంచి, కృతయుగంబుస్థాపించి కృతయుగ ధర్మంబుల బ్రోచును.

శ్రీ రామావతారంబు సకలావతారంబులం బూర్ణావ తారంబగుగ శ్రేష్ఠత మంబై యున్నది.

శ్రీకృష్ణభగవానులు సజ్జనులంబ్రోచి, దుర్జనుల సంహరించి, ధర్మ సంస్థాపన నొనర్చి-

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్యమా మేకం శరణంవ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామిమాశుచః.

(శ్రీ మద్భగవద్గీత 18 అ. 66 శ్లో.)

నే భగవంతుండనియు, తన్ను శరణుకోరు మహాభక్తులకే నెల్లప్పుడు మోక్ష మొసంగుదుననియు లోకంబున జాటెను.

శ్రీరాముండు దుష్టశిక్షణ, శిష్టజనరక్షణల నొనర్చి ధర్మ సంస్థాపన నొనర్చక ఆత్మానంమానుషం మన్యే యని నుడువుచు భగవంతుండు వైకుంఠ నగరంబున విరాజిల్లుననియు నద్దేవదేవు భజయించి మోక్షంబు చూరగొనుండనియు జాటెను.

శ్రీరామ శ్రీకృష్ణద్వ్యవతారంబుల చియ్యాదియ యంతరంబు.

శ్రీరాముండు నిజావతార రహస్యంబు గుప్తం బొనర్చెను. శ్రీరామ చంద్రుండు కేవల మానవుని రీతి వర్తించునెడ రావణ కుంభకర్ణాదులు మడి యింపగలరు.

శ్రీకృష్ణభగవానులు తానే లోకనాథుండనని జాటించు నెడ దుష్టాత్ము లింం గూలుదురు.

కావున శ్రీరాముం డవతార రహస్యంబు గుప్తం బొనర్చెను. శ్రీకృష్ణుం డవతారరహస్యంబు లోకంబున జాటెనున్నది.

శ్రీ రామావతారంబు పూర్ణావతారంబు. శ్రీకృష్ణావతారం బంశావతారంబు.





# యుగములు - మహాయుగములు - మనువులు

యుగములు నాలుగు :- 1) కృతయుగము, 2) త్రేతాయుగము ద్వాపరయుగము, 4) కలియుగము.

| | | | |
|---|---|---|---|
| 1) కృతయుగము | : | 17,28,000 | సంవత్సరములు |
| 2) త్రేతాయుగము | : | 12,96,000 | ,, |
| 3) ద్వాపరయుగము | : | 8,64,000 | ,, |
| 4) కలియుగము | : | 4,32,000 | ,, |

నాలుగు యుగములలో మొత్తము కాలము 43,20,000

ఈ నాలుగు యుగములు కలిసి మహాయుగమని పేరు ఇది 43,20,00 సంవత్సరములు. ఇది ఒక మహాయుగము.

ప్రతియొక మనువు డెబ్బదియొక్క మహాయుగములు పాలించును.

కృత, త్రేతా, ద్వాపర కలియుగంబులు కలసి మహాయుగ మగును.

సృష్ట్యాది 1) స్వాయంభువ, 2) స్వారోచిష, 3) తామసి 4) ఉత్తమ, 5) రైవత, 6) చాక్షుసాదియారు మన్వంతరరంబులు గడచెను. అనగా (7 × 6 = 426) నాలుగు వందల ఇరువదియారు మహాయుగములు గడచెననియు, ఏడవదియగు వైవస్వత మన్వంతరంబు జరుగుతున్నదని మనము తెలియ దగును. ఇట్టి వైవస్వత మన్వంతర పరిమితి డెబ్బదియొక్క మహాయుగంబులకు యిరువదియేడు మహాయుగములు గడచి ఇరువది యెనిమిది మహాయుగాంతర్గత కలియుగంబు వర్తమానంబున నడచుచున్నది.



# అవతారావశ్యకత

శ్లో॥ యదా యదాహి ధర్మస్యగ్లా నిర్భవతి భారత,

అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహం

(భగవద్గీత 4అ 7, 8 శ్లో,)

తా॥ అర్జునా! ఎప్పు డెప్పుడు ధర్మమునకు హానియు నధర్మమునకు వృద్ధియుఁగలుగుచుండునో అప్పు డప్పుడు మాయచేతను బుట్టుచుందును.

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం

వినాశాయచ దుష్కృతామ్,

ధర్మసంస్థాపనార్థాయ
సమ్భవామి యుగే. (8)

తా॥ ఎందుకనగా:— ప్రతియుగమునందును సన్మార్గులను రక్షించుటకును, దుర్మార్గులను నశింపజేయుటకును, ధర్మములను బాగుగా స్థాపించుటకును బుట్టుచుందును.

అని శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు చెప్పెను.

శ్లో॥ కృతేతు నరసింహశ్చ త్రేతాయాం రఘునందన
ద్వాపరే వాసుదేశ్చ కలౌ వేంకట నాయకః॥

తా॥ శ్రీ మహా విష్ణువు కృతయుగమందు శ్రీ నరసింహావతారమును త్రేతయుగమందు శ్రీరామావతారమును ద్వాపరయుగమందు శ్రీకృష్ణావతారమును కలియుగమందు శ్రీ వేంకటేశ్వరుని అవతారమును యెత్తి దుష్టశిక్షణ శిష్టరక్షణ గావించెను.

కృతయుగమందున భగవంతుడగు శ్రీమన్నారాయణుండు లక్ష్మి సమేతుండై పాలకడలియందు శయనించియుండ జయవిజయులను ద్వారాపాలకులు వైకుంఠద్వారమునుగాచు చుండిరి అట్టితరి సనకసనందనాదులు భగవంతుని దర్శింపగోరి వైకుంఠమున కరిగిరి. ద్వారపాలకులు సనకసనందనాదులజూచి యిట్లు పలికిరి. భగవంతుడు లక్ష్మిసమేతుడై హంసతూలికా తల్పమందు శయనించి యున్నారు. మీరిపుడు వారిని దర్శించుటకు సమయము కాదనిరి, అప్పుడు సనక సనందనాదులు ద్వారపాలకులజూచి భగవంతుండెచ్చట యేవిధముగానున్ననూ ఆయనను దర్శించుటకు మాకు ఆటంకముండదని బలుకుచూ ద్వారమును సమీపించిరి. ద్వారపాలకులు సనకసనందనాదులను లోనికి పోనివ్వక అడ్డగించిరి. అంత సనకసనందనాదులకు కోపముగలిగి ద్వారపాలకులనుజూచి మీరు రాక్షస వంశమందు జన్మింతురుగాకయని శపించిరి. వారు శాపంబిచ్చిన వెంటనే ద్వార పాలకులు కిరీట శంఖ చక్ర గదాహీనులై నిలిచిరి,అంతలో విష్ణుమూర్తి యీ విషయము దెలిసికొని సనకసనందనాదులకు దర్శనంబిచ్చెను. అపుడా ద్వారపాలకులు విష్ణుదేవునకు నమస్కరించి మాకుగలిగిన శాపమును నివర్తింపవలయునని వేడుకొనిరి. విష్ణుదేవుడుద్వారపాలకులతో విట్లు బలికెను. సనకసనంనాదులిచ్చిన

శాపమును వారేమరలింపవలయునని బలికెను. సనకసనందనాదులు ద్వారపాలకుల శాపమును మరలింపదలచి వారిని జూచి మేమిచ్చిన శాపము వృధాకాదు. అందు వలన మీరు హితులై ఐదు జన్మలలో గాని, విరోధులై మూడుజన్మలలోగాని విష్ణు దేవుని పాదారవిందము జేరగలరు. మీకేది సమ్మతమని ప్రశ్నించిరి అంత ద్వార పాలకులు మూడుజన్మములలో విరోధులై శ్రీమన్నారాయణుని పాదారవిందంబు జేరుదుమని బల్కిరి.

తరువాత పాలకులు మొదటి జన్మమున హిరణ్యకశ్యప, హిరణ్యాక్షులు గాను రెండవ జన్మమున రావణకుంభ కర్ణులుగను మూడువజన్మమున శిశుపాల దంతవక్త్రులుగను జన్మించిరి. వారిని శ్రీమన్నారాయణుడు వరుసగా శ్వేతవరాహ నారసింహావతారముల హిరణ్యాక్ష హిరణ్యకశ్యపులను, శ్రీరామావతారమున రావణ కుంభ కర్ణులను, శ్రీకృష్ణావతారమున శిశుపాలదంత వక్త్రులను సంహరించి లోకకళ్యాణ మొనర్చెను.

# శ్రీ రా మా వ తా ర మ హి మ



"శ్లో॥ శ్రీరామచంద్రః శ్రితపారిజాతః సీతాముఖాంభోరుహ చంచరీకః
సమస్త కళ్యాణ గుణాభిరామః నిరంతరం మంగళమాతనోతు॥ "

పూర్వము పుణ్యప్రదమగు త్రేతాయుగమునందు [వైవస్వత మన్వంతర చతుర్వింశతిత మహాయుగాంతర్గత త్రేతాంతిమ భాగంబున] శ్రీమన్నారాయణుండవతరించెను.

హిరణ్యాక్ష హిరణ్యకశ్యపులు రెండవ జన్మమున రావణకుంభకర్ణులై జన్మించి యింద్రాది దేవతలు మొదలు అష్టదిక్పాలకులకులు తాపసులు గంధర్వులు

కిన్నర కింపురుష సిద్ధ విద్యా ధరులు మొదలుగా దేవతలను మానవులను అనేక విధముల బాధింపసాగిరి. వీరి బాధనుండి తప్పించుకొను ఉపాయము గానక శ్రీ కశ్యప గౌతమ అగస్త్య వామదేవ శతానంద సనకసనందనాది యోగులు మొదలగువారందరూ యీ రాక్షస దురంతములను విష్ణుదేవునకు దెలుపుటకై వైకుంఠమునకు బోయిరి. కాని విష్ణుదేవుడు వైకుంఠమందులేడని తెలసికొని విష్ణుదేవుడున్న చోటు దెలియక వెదకి తుదకి క్షీరసాగరమున కుత్తరభాగముసజేరి విష్ణుదేవునిగూర్చి ధ్యానింపసాగిరి, కొంత కాలమున కొక మహాపురుషుడు వారికి ప్రత్యక్షమై విష్ణుదేవుడు యిచటలేడు. భూమియందొక పర్వతమున రమా సమేతుడై నివసించియున్నాడని పలికి అంతర్థానమయ్యెను. అంతవారు ధ్యానమును చాలించికొని భూమిమీదికి వచ్చుచుండిరి. మార్గమధ్యమున నారదమునీంద్రుడు వారితో కలసికొని యిట్లు పలికెను నేను విష్ణుదేవుడు లేనందున మరలివచ్చు చున్నాను. విష్ణువున్న చోట ఆ చతుర్ముఖునకు తెలుసునుగానీ మనకగోచరమని పలికి మనమందరము సత్యలోకమునకుబోయి రావణాది రాక్షస బాధలు బ్రహ్మకెరింగింతుము రండని బలికి వారిని వెంటం బెట్టుకొని అందరు సత్యలోకముజేరి చతుర్ముఖునకు సాష్టాంగ దండప్రణామంబుల గావించి రావణాది రాక్షసులవల్ల వారికి గలగిన బాధను నివారింపవలయునని ప్రార్థించిరి. అప్పుడు బ్రహ్మదేవుడు వారిని యోదార్చి ఇట్లు బలికెను. ఓ మునిసత్తములారా ! రావణాసురుడు ఘోర తపస్సుజేసి దేవతలవలన మృత్యువుకలుగకుండ యుండవలయునని శివునివలన వరములబడిసియున్నాడు. వారిని సంహరించుటకు దేవతల కలవి కాదు. మన మందరము శేషాద్రిజేరి రమాసమేతుడై అచట నివసించియున్న విష్ణుదేవుని ప్రార్థించి వారివలన ఈ రాక్షస వంశము నిర్మూలమగు ఉపాయము గావింతుమని బలికి వారిని వెంటబెట్టుకొని శేషాచలముజేరెను. వారందరు స్వామిపుష్కరిణి యందు స్నానమాచరించి తదేక ధ్యానముతో విష్ణుదేవుని ప్రార్థింపసాగిరి.

ఆకాలమున అయోధ్యానగరమును పాలించుచుండిన దశరధుండు రాజాధి రాజులలో శ్రేష్టుండని ప్రసిద్ధిజెందెను. కోసలాధిపు భానుమంతుని సుత కౌసల్యను, మగధరాజపుత్రి సుమిత్రను, కేకయ రాజగు నశ్వపతి కొమార్తె గైకను వివాహం బాడెను. పట్టమహిషులగు వీరల మువ్వురుగాక నింకను మూడువందల యేబది మంది క్షత్రియకన్యలను వివాహంబాడెను. వీరిలో నొకరికి శాంతయను కుమార్తె

గలిగెను. దశరథుని బాల్య మిత్రుండును యంగదేశాధీశుడునైన చిత్రరథుడు సంతాన హీనుండయి తన్ను కోరగా నారాజునకు పుత్రికగా నొసంగెను. తదాది శాంత యతని పుత్రికగా పేరొందెను. దశరథునకు పుత్రసంతతి లేని కారణము వలన తన గురువులైన వశిష్ఠ మునీంద్రుని యుపదేశమువలన శేషాద్రిజేరి అందే భగవంతునిగూర్చి తపమాచరించుచుండెను. ఇట్లు తపమాచరించు సమయమున వశిష్ఠుడు దశరథునిజూచి దశరథా అచట బ్రహ్మాది దేవతలు విష్ణుదేవునిగూర్చి ధ్యానించుచున్నారు. వారికి విష్ణుదేవుడు తప్పక దర్శనం బిచ్చును. నీకు మహా మంత్ర ముపదేశింతును. నీవును వారితోజేరి ధ్యానింపుమనిబలికి దశరథునకు మంత్రోపదేశము జేసెను. అప్పుడు తన గురువుల అజ్ఞానసారము బ్రహ్మాది దేవతలతో గూడి విష్ణుదేవుని ప్రార్థింపసాగెను. ఇట్లు అందరు తదేక ధ్యానముతో భగవంతుని ధ్యానించుచుండు సమయంబున అచ్చట ఒక గొప్ప శబ్దము వినబడెను. వారాశబ్దము వచ్చినవైపును జూచుచు ధ్యానించుచుండిరి కొంతసేపటికి అచట ఒక బంగారుమయమగు ప్రభ కాన్పించెను. అందరు ఆ ప్రభను జూచుచు భగవంతుని ధ్యానించుచుండిరి. కొంత సేపటికి ఆ ప్రభయందు దేదీప్యమానమై నవరత్న ఖచితమైన ఒక విమానము కాన్పించెను. ఆ విమానమందు శ్రీ మన్నారాయణుండు చతుర్భుజములుగల్గి శంఖ చక్ర గదా ఖడ్గముల ధరించి లక్ష్మీసమేతుడై ప్రత్యక్షమాయెను. అపుడు బ్రహ్మాది దేవతలు దండ ప్రణామంబులాచరించి ముకుళిత హస్తులై అనేక విధముల ధ్యానించి రావాణాది రాక్షసుల వలన తమకు గలిగిన బాధలను నివారింపుమని వేడుకొనిరి. ఇట్లు వేడుకొన్న దేవతల జూచి, రావణుడు, శివుని మెప్పించి అనేక వరములబడసి యున్నాడు దేవతలచే వానికి మృత్యువు లేదు. మానవావతారమున వానిని సంహరింపవలయును, మీరు కొంత కాలము ఓర్పు వహింపవలయునని బలికి, దేవతల నోదార్చి వారిని వారి వారి నిజస్థానములకు బంపి దశరథుని జూచి, దశరథా! నీ మనోభావమును నేనెరుగుదుని నీవు పోయి పుత్రకామేష్టి యాగముచేయుము. నీకు అతిబలశాలురగు పలువురు పుత్రులు జన్మింతురు. వారివలన దుష్టసంహారమును శిష్ట పరిపాలనమున్నూ జరుగునని పలికెను. ఆ మాటలువిని దశరథుడు సంతోషభరితుడై ఆయోధ్యాపురమునకుబోయి శ్రీ హేవళంబినామ సంవత్సర వైశాఖావియందు విభండకసుతుండును, దశరథుని మూడువందలయేబది సతీమణుల యందొక సతీమణి కుమార్తెయగు శాంత మనోహరుండును భావిసూర్య సావర్ణి మన్వంతరమున సప్తమహాఋషి మండలం

బున నిజదీప్తిం దేజరిల్లు ఋష్యశృంగ మహామునీంద్రు యాజకత్వంబున నశ్వమేధ పుత్రకామేష్టి యాగాదుల నొనర్చి; హోమ గుండమున నగ్నినుండి వెలువడు ప్రజాపత్య పురుషుం డొసంగు పాయసకలశంబును స్వీకరించి, ప్రదక్షణము చేసి, మున్నాట యేబదిమంది నిజసతీమణులకా ద్విజ పాయసంబు నొసంగక నిజ పట్టమహిషత్రయంబున కద్దాని నొసంగ నిశ్చయించి అందుసగము కౌసల్యాదేవికిని, మిగిలిన దానిలో సగములో సగమును సుమిత్రాదేవి కొసంగి, శేషించిన దాని యర్థ భాగంబు కైక కొసంగి, మిగిలిన భాగంబును తిరిగి సుమిత్రకునిచ్చెను అనగా అగ్నిదత్తపుగు పాయసంబును రెండు భాగములుచేసి ఒక భాగమును కౌసల్యాదేవికిచ్చెను. శేషించిన సగభాగమును తిరిగి రెండు భాగములుచేసి ఒక భాగమును సుమిత్ర కొసంగెను. తక్కిన సగమును మరల రెండు భాగములుచేసి ఒక భాగమును సుమిత్ర కొసంగెను. తక్కిన సగమును మరల రెండు భాగములు చేసి ఒక భాగమును కైక కొసంగి, మిగిలిన భాగమును తిరిగి సుమిత్ర కొసంగెను. అట్టి పాయసమును దశరథుం డిచ్చిన వెంటనే కౌసల్యా కైకలు భుజించిరి. కాని సుమిత్ర మాత్రము వారిరువురు భుజించిన పిమ్మటనే తాను భుజించెను వారలు ముప్వురు యానందపరవశులై యద్దానింగ్రోలిరి. త్రిమూర్తి భామినుల భాతి దేజరిల్లు నమ్మువ్వురు గర్భంబులదాల్చి, ద్వాదశమాస పర్యంతము (12 నెలల) గర్భంబుల వహించి, శ్రీ విళంబినామ సంవత్సర చైత్ర శుద్ధ నవమి బుధవారమున నభిజిన్ముహూర్తమున పునర్వసు నక్షత్రయుక్త కటకలగ్నమందు శశిం గూడిన బృహస్పతి యుదయవేళను. భానుండాది పంచగ్రహంబు లుచ్చస్వక్షేత్రంబులందుండ గౌసల్యాదేవి జగత్పాలకుండగు శ్రీ మహావిష్ణువు నర్ధాంశమూర్తి యగు శుభలక్షణోపేతుండును. రఘు వంశ వర్ధనుండగు శ్రీ రామచంద్రుని గనెను.

దేవపాయసంబునం దర్థభాగంబు శ్రీరాముడగుట నర్థాంశమని యనంబడెను. కైకయు నామరునాడు నవచైత్రశుద్ధ దశమి గురువారమునాడు పుష్యమీ నక్షత్రయుక్త మీనలగ్నంబున సూర్యోదయాత్పూర్వంబున భరతుని గనెను. సుమిత్రయూ నా దినముననే అనగా నవచైత్ర శుద్ధదశమి గురువాసరాశ్లేషా నక్షత్రయుక్త కర్కాటలగ్న నభిజిన్ముహూర్తమున లక్ష్మణ శత్రుఘ్నులను కవలలంగనెను.

రావణాసురుడు గొనిపోయిన మాయసీత వేదవతియను ఒక పతివ్రత. ఒకాప్పు డామె తపస్సుజేయుచుండ రావణుడు తన్ను వివాహమాడుమని ఆమెను బలాత్కరించెను, అప్పుడు వేదవతి నేను విష్ణుదేవుని వివాహమాడవలయునని తపస్సుచేయుచున్నాను, మాతండ్రి యభిప్రాయమును నెరవేర్చవలయునని బలికెను.

ఆ మాటలువిని రావణునకు యెక్కడలేని కోపమువచ్చి ఆమెను బలాత్కరింపనెంచి తనవామ హస్తముతో నామె తల వెంద్రుకలను బట్టుకొనెను. అపుడా పరమసాధ్వి విష్ణుదేవుని దలచుచు తన పతివ్రతామహిమవలన దక్షిణహస్తమును వాడిగల కత్తిగా మార్చి రావణుడు పట్టుకొనియున్న వెంట్రుకలను తన శిరస్సునందు మిగులనివ్వక ఖండించి వైచెను. రావణుడది జూచి ఆశ్చరముజెంది - ఓసీ! మూఢురాలా నీ మాయలకు భయపడువాడనుగానని ఆమెను బలాత్కరింప జూచెను. అపుడామె రావణునకు తనకు మధ్య అగ్నిజ్వాల గల్పించెను. రావణుడు తన వజ్రాయుధముతో నామంటలు చల్లార్ప సాగెను. అపుడా వేదవతి చేయునదిగానక ఓరీ! రావణా! నీ వలననే నీ అగ్నియందుబడి మరణించుచున్నాను. నావంటి స్త్రీవలన నీ రాక్షస వంశము నాశనము జెందునని బలికి ఆ అగ్నియందు బడెను.

ఆమెయే యీ వేదవతియను మాయసీత, రావణుడు సీతను గొనిపోయిన పిదప రాముడు సీతను గానక పరితపించుచూ జటాయువువలన సీతా వృత్తాంతము దెలిసికొని; జటాయువునకును మోక్షమిచ్చి, శబరిచే పూజింపబడియు, శ్రీ హనుమంతుని ద్వారా సుగ్రీవునితో స్నేహముచేసి, వాలిని సంహరించుటయును, వానరులు మాయసీతను వెదకుటయును, సుగ్రీవుని జేరి వాలిని సంహరించి వానర సైన్యములతో జేరి సముద్రమునకు వారధిగట్టి లంకాపురము ప్రవేశించెను. రావణ కుంభకర్ణాది దుష్టరాక్షసులను వధించి విభీషణునకు లంకాపురి పట్టణము గట్టి సీతాలక్షణ సమేతుడై పుష్పక విమానమెక్కి భారద్వాజాశ్రమముజేరెను. మునులు తనను ఆలింగనము జేసుకొనవలయునని కోరిన మునీంద్రులను జూచి నేను యేకపత్నీ వ్రతుడను ద్వాపరయుగమున మిమ్మాలింగనము జేసుకొందునని బలికి; సీత కొంత కాలము లంకయందుండిన కారణముచే అగ్నియందు ప్రవేశింపజేయ అగ్ని హోత్రుడు శ్రీ రామునకు ఇద్దరు సీతలను సమర్పించెను. అపుడు

రామచంద్రుడు అగ్నిహోత్రు చేసిన మాయను దెలసికొని కలియుగమునందు వేదవతిని వివాహమాడుదునని బలికి నామెకు వరంబిచ్చెను. భరతుని దీక్ష విరమింపజేసి అయోధ్యానగరము జేరి పట్టాభిషిక్తుడై యిమ్మేదినీ చక్రంబుఁ బదునొకండు వేలేండ్లు రాజ్యపాలనజేసెను. త్రేతాయుగ సమాప్తి కాలమందు శ్రీ రామచంద్రుడు నిర్యాణము జెంది లక్ష్మీసతుడై వైకుంఠము జేరెను. త్రేతాయుగము సమాప్తమాయను. శ్రీ రామావతార నిర్యాణము జరిగి 1, 18 48, 78 సంవత్సరములు జరిగినది.

ఓం తత్సత్.

---

# — శ్రీ రామ తత్వము —

శ్రీ రామచంద్రమూర్తి వేదవిహితకర్మముల నాచరించి లోకమునకు దారిచూపెను,

సతీపతి సుతాదిధర్మములు, ధర్మములు, నన్నదమ్ముల ధర్మములు, రాజసేవక ధర్మములు, విగ్రహారాధనాదులు మొదలగు సర్వ ధర్మములు తానాచరించి చూపినవాడు శ్రీరాముడు

శ్రీరామచంద్రమూర్తి సాక్షాత్తుగ సచ్చిదానంద పరబ్రహ్మ. భక్తులపైన భగవంతునకు పరమ ప్రేమ, సర్వసంగ పరిత్యాగులై తననే శరణుపొంది, అనన్యభక్తితో ధ్యానిస్తున్న మహర్షులకోసం భగవంతుడు వైకుంఠమును వదలి అయోధ్య దశరథమహారాజునకు బుత్రుఁడై జనించెను. అయోధ్యను పరిత్యజించి పాదచారియై ఋషులను వెదుక్కుంటూ ఘోరారణ్యములో ప్రవేశించెను. తన రూపమును ధ్యానిస్తూ తదేక నిష్ఠులైయున్న తాపసోత్తముల యందలి ప్రేమచేత తానాముని వేషమును ధరించి వారి వారియాశ్రమముల కేగి స్వయంగా అర్చించి ఆనందించిన భగవానుడు సీతాపతి తనను సేవించిన భక్తులను సేవించడమే

భగవంతుని కర్తవ్యము. పరమసాత్త్విక మూర్తులైన మునులను పీడిస్తున్న దుష్టులగు రాక్షసులను సంహరించి వారి బాధలను తొలగించినవాడు శ్రీరాముడు, భగవంతుడు అధర్మాన్ని అణచి, ధర్మములను సముద్ధరించును, అట్టి శ్రీరామచంద్రుని అనుగ్రహమునకు పాత్రులమై తరిద్దాము.

హరేరామ హరేమ రామ రామ హరేహరే।
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే॥

ఇ ఆ శ మ్.

# :శ్రీ కృష్ణావతార మహిమః



శ్లో॥ వసుదేవ సుతం దేవం । కంస చాణూర మర్దనమ్ ।
దేవకీ పరమానందం । కృష్ణం వందే జగద్గురుమ్.

శ్లో॥ కృష్ణం కమల పత్రాక్షం । పుణ్యశ్రవణ కీర్తనం
వాసుదేవం జగద్యోనిం । నౌమి నారాయణం హరిమ్.

శ్లో॥ కృష్ణాయ యాదవేంద్రాయ । జ్ఞానముద్రాయ యోగినే
నాథాయ రుక్మిణీశాయ । నమో వేదాంత వేదినే.

శ్లో॥ ప్రసన్న పారిజాతాయ । వేత్రతోత్రైక పాణయే ।
జ్ఞానముద్రాయ కృష్ణాయ । గీతామృత దుహేనమః.

శ్లో॥ సారథ్యే మర్జునస్యాజ్ఞా ! కుర్వన్ గీతామృతమ్ దదౌ।
లోకత్రయోపకారాయ । తస్మై కృష్ణాత్మనే నమః॥.

## "ద్వాపరే వాసుదేవశ్చ"

శ్రీ మహావిష్ణువు రామావతారమున ఋషుల కిచ్చిన వరముల నెరవేర్చుటకు శిశుపాల దంతవక్త్రుల వధించుటకును,

(రావణకుంభకర్ణులు మూడవ జన్మమందు శిశుపాలదంత వక్త్రులుగా జన్మించిరి) ద్వాపరయుగమునందు భగవంతుడు దేవకీ వసుదేవులకు పుత్రుడయి జన్మించెను.

శ్రీ బలరాముడు రోహిణీవసుదేవులకు కుమారుడై జన్మించెను, శ్రీ బలరామ కృష్ణుల జననముహూర్త మభిజిత్తనియు దేవకీ యశోదల గర్భంబు లందేక రాత్రియందే శ్రీకృష్ణయోగమాయ లుద్భవించిరి.

''ద్వాపరాంతే హరేర్జన్మ యదువంశే భవిష్యతి" అన్నట్లు ద్వాపరయుగాంతమున శ్రీముఖనామ సంవత్సర శ్రావణ బహుళ నవమి విద్ధాష్టమీ తిథియందు రాత్రి నిశీధ సమయమున వృషభలగ్న సంభూత సర్వోత్తమంబగు అభిజిన్ముహూర్తమున శ్రీ మదాది నారాయణ పరబ్రహ్మమూర్తి లీలా గృహీత శరీరుండై యవతరించెను. సాక్షాత్ లక్ష్మీదేవియే శ్రీ రుక్మిణీదేవిగా కుండినాధీశుం డగు భీష్మకుని ఇంట పుత్రికగా యవతరించెను.

శ్రీకృష్ణుడు పూతనను సంహరించి: కంసుని వధించెను. శ్రీ రుక్మిణీదేవిని రాక్షస వివాహమున గొనిపోయి పెండ్లియాడెను.

కౌరవులచే వంచింపబడిన పాండవుల పక్షపాతియయ్యెను. దుర్యోధనాదులచే మానభంగము గావింపనెంచిన ద్రౌపదికి అక్షయమైన వలువలిచ్చెను.

వనవాసమున పాండవుల ఆపదలు కాపాడి అజ్ఞాతవాసమున కీచకుని భీముని సహాయముతో హతమార్చెను.

పంచపాండవులకై రాయబారము గావించి తుదకు ప్రయోజనముగానక దుర్యోధనాదుల రణరంగమున గూల్పనెంచి అర్జునునకు గీతోపదేశము గావించెను.

అర్జునునివలన దుర్యోధనాది దుష్టులను వధియించి హస్తినాపురంబును పాండవులకు పట్టాభిషేకము గావించెను.

పాండవులు రాజ్యపరిపాలనము జేయుచుండ శ్రీకృష్ణుడు గోపికలతో లీలావినోదంబులు గావించుచూ గోపికారూపములనున్న ఋషీశ్వరులను తృప్తి పరచెను.

రామావతారమున ఋషుల కిచ్చిన వరములను నెరవేర్చి, పింగళయను వేశ్యకాంతకిచ్చిన వరము ప్రకారము మధురాపట్టణమున కుబ్జరూపంబున జనింప నామె మనో వాంఛ దీర్చెను. గుణవతియను బ్రాహ్మణయువతి కిచ్చినవరము ప్రకారము నామె సత్యభామగా జన్మింప, నామెను వివాహమాడెను. కన్యాకుమారి కిచ్చిన వరప్రసాదమువలన నామె జాంబవతిగా జన్మింప, నామెను వివాహమాడెను.

వాలియిచ్చిన శాపమువలన బోయవానిచే వేయబడిన బాణముతో భూమిపై బడి విలపించుచుండెను. అర్జునుడీ విషయమును ద్వారకావాసులకు దెలిపెను. అంత ద్వారకావాసులందరు ఆబాలగోపాలము కృష్ణపరమాత్మని వద్దజేరి దుఃఖింప సాగిరి, అంత శ్రీకృష్ణుడు ద్వారకావాసులనుజూచి ఇక కొంత కాలమునకు కలి ప్రవేశించుచున్నాడు గాన మీరందరూ కలియుగమునందున నన్ను ధ్యానించి నా పాదారవిందము జేరుదురని బలికెను.

ఇంతలో యశోదాదేవి జూచి కృష్ణా నిన్ను ఎన్ని జన్మలు సేవించిననూ నాకు తనివి తీరకున్నది. నీ వెచట నున్నను నేను నీ సేవజేయ గోరనున్నా ననెను. అపుడు కృష్ణుడు యశోదాదేవిని జూచి, అమ్మా! నీ వీ శరీరమువదలి

వకుళమాళికపై శేషాచలము జేరి అచట ఆదివరాహస్వామికి పరిచర్య జేయు చుండుము కలియుగమునందు నేనక్కడికి రాగలనని జెప్పెను.

అర్జునునిజూచి అర్జునా! కొన్ని గడియలతరువాత ఈ పదహారువేల గోపికా స్త్రీలకు నిజస్వరూపము గల్గును. అంతవరకు వీరిని కాపాడుమని పలికి, గోపికలను జూచి మీకు కొన్ని ఘడియలలో మీ నిజస్వరూపము గల్గును. మిమ్ము అంత పర్యంతము అర్జునుడు కాపాడునని పలికి కృష్ణుడు తన శరీరము వదలి లక్ష్మీ సమేతుడై వైకుంఠము జేరెను.

శ్రీ కృష్ణుడు లీలామానుష విగ్రహుడై 125 సంవత్సరముల 7 నెలల 8 రోజులు ప్రధానమున నుండి కలియుగాది యందు ప్రమాది సంవత్సర చైత్ర శుద్ధ ప్రతి పత్తిథి భృగువాసరమున నిర్యాణము జెందెను.

తరువాత కొన్ని ఘడియలకు గోపికలు నిజస్వరూపములు పొందిరి కమండలము యోగదండములు చేతబూని ఆ ఋషులందరు శేషాచలముజేరి తప మాచరింపసాగిరి.

ఇంతలో కలి ప్రవేశించెను, ధర్మరాజు కలిప్రవేశమును దెలిసికొన్నవాడై తన తమ్ములతో ద్రౌపదిని వెంటబెట్టుకొని వైకుంఠమునకు పయనమై పోసాగెను. ద్రౌపది మొదలు నలుగురు సహోదరులు మార్గమధ్యమందే శరీరములు వదలి విష్ణుదేవు నాశ్రయించిరి. ధర్మపుత్రుడు మాత్రము ధర్మదేవతతో వైకుంఠము జేరెను.

హరేరామ హరేరామ రామరామ హరేహరే !

హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరేహరే !

ఓం తత్సత్



# శ్రీ కృష్ణతత్త్వము

ఈ నాటికిని భారతీయ జీవనమునకు కృష్ణతత్త్వము మూలకందముగా నున్నది. ఈ చరిత్రాత్మక ఘట్టమునందుండు దానిని దిఙ్మాత్రముగా వివరింతును.

ఐతిహ్యముగా, వాఙ్మయపరముగా, ఆత్మసంబంధిగా, శ్రీకృష్ణుడు ప్రధాన పాత్ర—ప్రతియొకదానియందు ప్రతియొక రూపమైన మూర్తిగా కృష్ణుడు తటాలున గోచరించును. యదు వీరునిగా, రక్షకుడుగా, దైవసంబంధమైన సహజగుణ విశేషణముచేత వీరునిగా, రూపమును ధరించిన విష్ణునిగా, ప్రియమైన బిడ్డగా, యువకవీరునిగా, గౌరవనీయుడైన ప్రేమకునిగా లోబరచుకొన వీలుగాని వానినిగా, దూరదృష్టిగల రాజనీతి నిపుణునిగా, చివరను నతడే భగవంతునిగా "శ్రీకృష్ణస్తుభగవాన్ స్వయమ్" అని భగవద్గీతలో చెప్పబడినట్లుగా, శాశ్వత ధర్మరక్షకునిగా నాయనగోచరించును.

యాదవు లార్యజాతి ప్రారంభదశలో ముఖ్యులు. వారు యదుమహారాజు సంతతివారు. శుక్రాచార్య పుత్రికయగు దేవయానికిని, యయాతి మహారాజుకును కల్గినవాడు యదువు. వారు ఆర్య నాగరికతను నైఋతి దిశయందును రాజపుత్ర స్థానము, గుజరాతీ, మాల్వా, దక్షిణభారతములో వ్యాపింపజేసినారు.

శ్రీకృష్ణుని జీవితమున ప్రారంభఘట్టముతో గూడిన మధురానగరము యొక్క ఐతిహ్యముగ ''హరివంశము భారతమునకు అనుబంధము. అదికూడ

యాదవాక్రమిత ప్రదేశముల తెల్పుచున్నవి మరియు కృష్ణుడు గోమంతకమున (నవీనగోవా) నాశ్రయమందెననియు తెలియబడుచున్నది. శ్రీకృష్ణుని పిరవృత్తి- బలము కేంద్రీకరించుట - బాంధవ్యములకు రూపమిచ్చుట - ధర్మసంస్థాపన మొనర్చుట.

పూర్వము ఆర్యులు నాలుగు అంతర్వివాహములు చేసికొనెడివారు, భారతమునందును, పురాణములందును, చెప్పబడిన నాగజాతి (వర్తమాన నాగజాతి కాదు) వారు వేదకాలపు ఆర్యజాతికి కొన్నివందల శతాబ్దములకుముందు హిందూదేశ వాసులైనారు.

శ్రీ కృష్ణుని జీవితము :- ఉత్తర హిందూదేశమున ఆర్య నాగజాతితులు మిశ్రమమగుటను సూచించుచున్నది. కృష్ణుని వంశకర్తయగు యదుమహారాజు అయిదుగురు నాగకన్యలను వివాహమాడెను. ఒక్కొక్కరి యందొక్కొక్కర కుమారునందెను. వారిలో "హరితుడు" అను వాడొక్కరుడు రత్నద్వీపాధిపతి యాయెను. ఆ రత్నద్వీప ప్రజలు సముద్రయానులు సముద్రాంతర్గత మత్స్యముల రత్నముల సాధించుటలో నేర్పరులు. ఆ రత్నద్వీపము నేటి పర్షియన్‌గల్ఫులేక అరేబియా సముద్రమై యుండవచ్చును.

శ్రీ కృష్ణుని తండ్రియగు వసుదేవుని తల్లియు, పాండవుల తల్లియగు కుంతీదేవియొక్క తల్లియు నాగరాజు కుమార్తెలు శ్రీ కృష్ణునకు జమవస్త్రియను ఆర్యేతర స్త్రీ భార్యగాగలదు. కురుక్షేత్ర సంగ్రామమున మహాభారతము) శ్రీ కృష్ణపాత్ర ప్రాముఖ్యత గాంచినదై హిందూదేశముయొక్క ఇతిహాసమై యొప్పునది.

మహాభారతము అనేక అంతస్తులతో గూడిన శ్రీకృష్ణ జీవితైతిహ్యములతో నొకదానిపై నొకటిగ గూడియున్నది .అందున ముఖ్యమైన భగవద్గీతయందు పదునొకండవ యధ్యాయము. అందు కృష్ణుడు తన నెచ్చలియగు అర్జునునితో రహస్యములలో రహస్యమైనదియగు నది తాను విష్ణువనునది చెప్పుట. నిజముగ నంతవఱకు శ్రీ కృష్ణుని దైవత్వమతని కత్యంతాప్తుడైన యర్జునునకే తెలియదు.

కృష్ణ సంబంధిగా అవతార సిద్ధాంతము హిందూమతమున నైకత్వతాశక్తిని కేంద్రీకృత మొనర్పగా నైనది. భగవద్గీతలో శ్రీ కృష్ణుడు భగవంతుడు. ధర్మసంస్థాపనకొరకు, దుష్టశిక్షణ, శిష్టరక్షణకొరకపుడపుడు కాలపరిణామము స్వయముగా తెలిపినాడు.

మరియొక సిద్ధాంతమున్నది. అది మూలాధారమైనది. అదేమనగ భగవంతునియందు విశ్వాసముంచుకొని ఇంద్రియనిగ్రహముగల్గి మనోనిగ్రహముగల్గి శ్రద్ధతో శరణాగతినంది, ప్రాపంచిక సుఖభోగవాంఛా విరక్తుడై భగవంతునిలో జీవించుట.

ఇంకొక సిద్ధాంతమున్నది. ఇది కృష్ణునిచే చిహ్నము వలన తెలియజేయబడుచున్నది. అది యెట్టిదనగ భక్తిప్రధానమని, అదియే పరమాత్మ సన్నిధిని జేర్చగలదని మరియు భక్తితో సేవించునెడ పరమాత్మ నేరూపమున సేవించినను ఫరవాలేదని. ఇతర మతములయెడ హిందువుల సహనము నమితముగా చూపించుటకు యథార్థముగానీ సిద్ధాంతము హేతుభూతమైనది.

శ్రీ కృష్ణుండందువలననే పూర్ణ పురుషోత్తముడై యావత్ప్రపంచారాధ్యుడైనాడు. ఏ మహద్భక్తిచే గోపికలు శిశువగు కృష్ణుని ప్రేమించి సేవించిరో యతి సాంప్రదాయ సిద్ధమైన భక్తి బీజమైనది. అయితే తత్సమయముగ విషయ వాంఛా సంబంధియైన విషయైతిహ్యము లేదు. నారదమహర్షి తన భక్తి సూత్రములలో చెప్పినట్లు భక్తియన భగవంతునకు భక్తుని సంపూర్ణ శరణాగతి.

ప్రేమను ఉద్దేపింపజేయుటలో, ప్రేమను పెంపొందింపజేయుటలో నతని సాహసకార్యములు ప్రసిద్ధమైన గీత గోవిందమునను, బ్రహ్మవైవర్త పురాణమునను ప్రముఖస్థాన మలంకరించినవి; ఎటులైననేమి ? శ్రీ కృష్ణభక్తి నలపించు జీవనమునందినది. భాగవతధర్మము భారతదేశ వ్యాప్తమైనది. అది కృష్ణభక్తి. ఈ యభివృద్ధిలో రాధ దేవతయైనది. ఆ విధముగ నింబార్కుయందు రాధాకృష్ణులు దైవములుగా భావించి శరణాగతి నందిరి కృష్ణగాథా చిత్రీకరణము తన్నామ గానము, తల్లీలాభినయనములు వ్యాప్తములైనవి. వేయేల కృష్ణుడు లేనిచో నేదియు లేదు. భాగవత ధర్మమున కుల, మత, లింగ భేదములు లేవు.

భగవత్ సేవలో భక్తిమార్గమున నెట్టి వివక్షతయు లేదు. భక్తి యొక్కటే ప్రధానము. మాధవుడు భక్తిప్రియుడు. గీతాచార్య సందేశము ఒక్క అర్జుననకే కాదు; సమస్త ప్రాణులకు సందేశము. అది ఒక మహద్గ్రంథము; ఆలోచనా శక్తినిది ప్రభావితము చేసెను. యావత్ప్రపంచమునను ఇంద్రియజ్ఞానముగల ప్రాణులయందును దైవసంబంధమైన దివ్యజ్ఞానముగల నీతిని ప్రభావితము చేసెను.

భగవత్పాదులు శ్రీ శంకరులు "ప్రస్థానత్రయి"గా దాని నంగీకరించిరి. ప్రస్థానత్రయి యయిన మొత్తము మూడు పుస్తకములు 1) ఉపనిషత్తులు 2) బ్రహ్మసూత్రములు 3) భగవద్గీత, ఆత్మలిపై కృష్ణునధికార ముద్రను తిరిగి యిచ్చెను భగవద్గీత నారాధించి దివ్యజ్ఞాన సంపన్నులైరి.

ఆత్మజ్ఞానాభివృద్ధి కొరకు వేయొక్కరును గుహావాసులు అరణ్యవాసులును కానక్కరలేదు. మనము చేయవలసినది భగవంతుని శరణుజొచ్చుటయే.



# శ్రీకృష్ణుని రాసలీల

పూర్వాచార్యులు కార్తీక పూర్ణిమా తిథియందు రాసలీలా పూజావిధానము జేసిరి.

రాసలీల :- గోపికలతోడ శ్రీకృష్ణుని యానందక్రీడ జగత్తునందలి సర్వజీవులను దన వంక కాకర్షించువాడు. సర్వ పాపముల సమూలాకర్షణము చేయువాడు శ్రీకృష్ణుడు, అతడే ఆనందమయ పరమాత్మ. అతడు సర్వత్ర నసంఖ్య గోపికలతో నానందలీల నెఱపుచున్నాడు. అసంఖ్య గోవులందు పదు నాఱుగురు శ్రేష్ఠులు. వారిలో నెనమండ్రుడు సఖులు శ్రేష్ఠతారలు. ఎనిమిది మందిలో మొట్టమొదటిదే శ్రేష్ఠతమ. రాసలీలయందు సృష్టి తత్త్వము బాగుగా తేటపడును. మూలప్రకృతివలన నీ జగత్తు పుట్టును. ఆమెయే పూర్తిగా, నీ రాస లీలయందు శ్రేష్ఠతమ గోపిక ! మూలప్రకృతివలన నేడు ప్రకృతులు వికృతి రూప పరిమాణమును సంఘటితమగును. అనగా మహత్తు, అహంకారము, పంచ తన్మాత్రలు అనునవే రాసలీల యందలి శ్రేష్ఠతమ గోపీతారలు, మఱి వానివలన బుట్టు పదునాఱు వికారములే పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు,

పంచభూతములు, మనస్సు అనునవియే రాసలీలయందు శ్రేష్టగోపులు, ఈ పదునాఱు ప్రకృతుల వికాస తారతమ్యములే నసంఖ్యా గోపికా భేదము కలుగుచున్నది, కావున రాసలీల యందలి గోపీ సంఖ్యా నిర్ణయించుట కాదు, జగత్తునందలి ప్రతి పరమాణువును బృందావనమే. ఇట్టి బృందావన మందెల్లవేళల నసంఖ్యా గోపికలతో నాత్మరూప శ్రీకృష్ణుడు విరాజిల్లును. గోపికల సంఖ్యా యనిర్ణేయమైనను. మనకు నచ్చజెప్పుటకుగాను పూర్వాచార్యులు పదునాఱుగురు గోపికలు గోపికలతో శ్రీకృష్ణుని రాసక్రీడను వర్ణించి, తాను సచ్చిదానంద స్వరూపుడయ్యును బదునారు (16) తత్త్వములనెడి గోపికల యందుండిన సత్త, చైతన్యము.

ఆనందము అనువాని యభివ్యక్తిని ప్రకాశింపజేయుచుండును శ్రీకృష్ణుని సత్తవల్లనే గోపికల సత్తయు. శ్రీకృష్ణుని చైతన్యము వల్లనే గోపికల ప్రకాశమును, శ్రీకృష్ణుని యానందము వల్లనే గోపికల పరిచ్ఛాన్నానందమును నభివ్యక్తమగుచుండును. పదునారు తత్త్వములనెడి గోపికలు, అనగా సింద్రియ శక్తులు ఆ యానంద నయన శ్రీకృష్ణుని సంధానమునుండి మరలిపోయి, యంతర్ముఖము లగుట మొదలిడును; అపుడు తమ తమ విశిష్టత యనెడి కులమాన లజ్జాదులను విడిచిపెట్టి పూర్తిగా నాత్మయందే మైమరచి, పరమపురుష నానంద లీలయందు బాల్గొనును. ఆ యానందమయి పురుషుడు శ్రీకృష్ణుడు తానొక అద్వితీయుడయ్యును నే విధముగా ప్రకృతి, మహత్తు, అహంకారము, పంచనాత్రలు, పంచభూతములు, మనస్సు ఇంద్రియ శక్తులు ననువానిలో నిల్చి యా యా భావములతో నాత్మ ప్రకాశము చేయునో; దాని చక్కని యనుస్మరణము నుపలబ్ధియు జేయుటకే రాసలీల విహితమైనది. గురుకృపను బొంది పురుష ప్రకృతి విషయక జ్ఞానమందధికారులైనవారే, ఈ విషయ బృందావనమందు నిత్య రాసలీలాస్వాదము చేయగల్గుదురు. సర్వరూపములతో, బహురూపములతో, జగద్రూపముతో ఆత్మప్రకాశముచేసి యానందమయ పురుషుడు నిత్యము నే యానంద లీలానుభవముచేయునో, దాని నొక్క గడియసేపైనను జీవుడు హృదయంగమ మొనర్చుటకే యీ రాసలీలా విధాన మేర్పడినది.

శ్రీ మద్భాగవతమున రాసలీలయందు శ్రీమతి రాధ పేరు విశేషించి యుల్లేఖింపబడినది. గోశబ్దార్థము ఇంద్రియము. ఇంద్రియమును బాలించువాడు

గోపుడు. పరమాత్మయే శక్తుల నాశ్రయించి సృష్టిలీలాప్రకాశము చేయునో యవే గోవులు. ఆత్మ శక్తులతోనే యాత్మ సేయు రస (ఆనందము) క్రీడయే రాసము. నిత్యబృందావన మనెడి హృదయక్షేత్రమందు నిత్యరాసలీలా సంధానము నొందవలెను. పూజనీయు డెవడో వాని మహత్త్వము భావము మున్నగువాని నెఱింగి చక్కఁగా నాత్మ సాక్షాత్కార మొనర్చుకొనగల్గు పూజకుని పూజలే సార్థకమగును.

ఓమ్ తత్సత్



# శ్రీకృష్ణుని డోలోత్సవము

ఈ డోలాయాత్ర యుత్సవము ఫాల్గుణ శుద్ధ పూర్ణిమనాడు జరుగును. ఆనాడీ యుత్సవము ఉత్తరానక్షత్ర ప్రధానముగా జేయబడును. శ్రీనాథుని యుత్సవ విగ్రహమును శ్రీదేవి సహితముగా డోల (ఊయల) యందుంచి, పూజించి, యూయలనూపుచు భక్తులు ఫల్గుచూర్ణమనెడి సువాసిత రక్తచూర్ణము (బగ్గుండ) స్వామి విగ్రహముపై జల్లుచు, యథేష్టముగా ప్రార్థింతురు. ఆ చూర్ణ మునే భగవత్ప్రసాదముగా బూజారులు భక్తులపై జల్లుదురు, భక్తులు యీ చూర్ణ మును భక్తు లొండొరులకు జల్లుకొందురు.

డోలోత్సవ తత్త్వము :- ఫాల్గుణశుద్ధ పూర్ణిమనాడు చేయబడును. విశ్వప్రకృతియొక్క సౌందర్యము మానవ చిత్తముల నాకర్షించు నా సమయమే భువనసుందరుని లీలా రసాస్వాదముచేయు విషయమున మిగుల ననుకూలములు.

మనస్సు స్వచ్ఛముగా నుండునపుడే యాధ్యాత్మిక భావరాశిని గ్రహించు లాభము గల్గును. భువనసుందరుడై యానంద ఘనవిగ్రహుడై యాత్మస్వరూప ముతో పరమప్రేమాస్పద రూపముతో బూర్ణ భావముతో నున్న యాతడే నిత్య స్థిరాత్మస్వరూపుడైన శ్రీకృష్ణుడే మనస్సు. ఇంద్రియాదులు ననువానిచే బరిచ్ఛిన్నుడై యుపాధి వశమున నిత్య డోలాయమానుడగుచున్నాడు (ఊగులాడు చున్నాడు) బ్రతిజీవుని హృదయమందును గురు రూపముతో నత్యంత స్వరూప ములతో నిత్యము నున్న యాతడే యింద్రియములదారిని తేబడు విషయములను బ్రకాశింపజేయుచు భోక్తృరూపములతో వెలయుచుండునపుడు ప్రతిక్షణమును నెంతగా నాందోళితుడగునో; ఆతని యీ డోలాయమాన స్వరూపమును యథా సంభవముగా ననుభవించుటకే యీ డోలోత్సవము విహితమైనది. మనము మన యింద్రియ రాజ్యమందు విహరించుచు బోవునపుడెల్ల జాంచల్యము ననుభవించు చున్నాము. అచంచలత యాతనిదే. నిత్యస్థిరుడును ఏకాద్వితీయుండునైన యతడే యీ చంచలత లోపలనుండి యట గల నీట జంద్రుడువలె బ్రకాశించు చున్నాడు. అమృతమయుండును, మధుమయుండును, ఆనందమయుండును పరమబురుషుండునైన యతడే భోగ్యభోక్తృ భోగరూపముతో బ్రకాశించుచున్నా డనెడి సత్యమును సంవత్సరము పొడుగున నొక్కనాడైనను ననుభవింపగల్గినచో మనుష్యుడు నిశ్చింతముగా నానందముతో నీదుఃఖభర సంసారారణ్యమునందు నిర్భయముగా సంచరింపగల్గును. ఏమనగా నొక్కనాటి స్మృతి మనుష్యుని జాలాకాలమువఱకు నానందమయుని జేసి యుంచగలదు. అతడే మన కేకాంత ప్రీతూడు. అతడు లేకున్నచో మఱి మన కేమియు నుండదు. అతని ప్రసాదము వల్లనే యీ వైచిత్ర విశ్వభోగములు సాగుచున్నవనెడి మాట నొక్కసారి మన స్సున కెక్కించుకొనగల్గినచో మనుష్యు డాతని యెడ ననురక్తుడు కాకుండ గలడా ? కనుకనే యీ డోలాపూజానమందు అనురాగమునకు బ్రతినిధిగా ఫల్గుచూర్ణముతో మన దేవతను అభిరంజితుని జేయుదుము.

మన మెల్లరము తెలిసియో తెలియకో జగత్తునందలి సర్వవస్తువులను బట్టిచూడ, భగవంతుని యందే విశేషానురాగము గలవారము. యథార్థముగా మన యనురాగమంతయు మనకు కేవలం ప్రియతముడై భగవంతునియందే పూర్తిగా పర్యవసించుచున్నదియని నిస్సంశయముగా నెఱింగించుటకే యీ డోలో త్సవము చేయబడును. లోపల దాగియున్న యా యనురాగస్వరూపమును యథా

ర్థముగా ననుభవింపజాలమిచే స్థూలమందు (వెలిని) ఇట్టి కర్మములుచేయు ప్రయోజనమున్నది. లోపల నిరవయానందరూపముగానో ప్రేమరూపముగానో యున్న వస్తువే వెలిని సైతము శ్రీకృష్ణవిగ్రహరూపమున మన యెదుట వెలయుచున్నది. అంతరమును గ్రహించుటకే యీ డోలాపూజ కర్మ యేర్పరుపబడినది. జ్ఞాన భక్తి ప్రేమాది దైవీసంపద నొందుచున్నాము.

ఇది కేవల డోలాపూజావిశేషఫలమే కాదు. సర్వపూజ వలన అపూర్వఫలలాభ మగును.

హరేరామ హరేరామ రామరామ హరేహరే !
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే

ఓం తత్సత్

శ్రీ రామకృష్ణులు లేని పురాణము పురాణముకాదు.
శ్రీ రామకృష్ణులు లేని సంహిత సంహితకాదు.
శ్రీ రామకృష్ణులు లేని కావ్యము కావ్యముకాదు.
ఆ కళ్యాణగుణుల జింతింపని, వర్ణింపని జన్మమదియొక జన్మమా ?

వేదవేద్యుఁ డగు నా భగవంతుడు కౌసల్యా దశరధుల కుమారుడుగా శ్రీరామచంద్రుడుగా నవతరించెను.

శ్రీరామ శ్రీకృష్ణ నామము లుచ్చరించినను, వినినను పాపములు భస్మీపటలము లగుదును. శ్రీరామ శ్రీకృష్ణ నామములందింత మహిమ యున్నది.

భగవంతుడు తన భక్తకోటియొక్క ప్రతిభాసంపత్తులను ప్రదర్శింపజేసి వాండ్లకు చిరయశస్థాన్సనం ప్రసాదించడానికే భగవంతుని అనంత అగాథ అనిర్వచనీయ లీలావిలాసములు మహాద్భుతాలు. భగవంతుని భక్తవాత్సల్యం అటువంటిది. భగవద్భాగవతోత్తముల మధ్య భేదమును ఎవరు కనుగొనగలరు ?

శ్రీరామకృష్ణుల సర్వదా మన హృదయంలో ప్రతిష్ఠించుకొని శ్రీ రామకృష్ణుల యనుగ్రహములకు బాత్రులమై శుభశ్రేయములపొంది పరమానంద సంభరితుల మగుదాము.

1. శ్రీరామ చంద్రుం డొకనాడు అనగా జానకీ పరిత్యాగమునకు పూర్వము ఒకనాటి నిశీథ సమయమున రక్షకభటులతి జాగ్రత్తగా రాజమందిరమును రక్షించుచుండ, అంతఃపురమున చదువుచున్నపుడు, జానకీదేవి శ్రీరాముని ప్రక్కన గాఢనిద్రలోనున్న సమయమున పింగళయను నా పట్టణ వేశ్యాంగన నొకతె 'పుంసాం మోహనరూపాయ' జితేంద్రియులగు బురుష వరేణ్యుల సైతము మోహింపజేయు మోహనాకారుండగు శ్రీ రామునితో పొం దుసలుపనెంచి రక్షకభటుల నెటులో మోసపుచ్చి యంతఃపురము ప్రవేశించెను. శ్రీరాముండా యువతి యలికిడివిని ఆశ్చర్యము చెందినవాడయి పుస్తకమును ముడిచి యామెంగాంచి ఓతన్వీ! ఇట్టి నిశీథసమయంబున నిచటకు వచ్చుటకు గల కారణమేమైయుండునని ప్రశ్నింప నా స్త్రీ భయముచే తడబడుచు, బొంగురుగొంతుతో 'దేవా! నేను పింగళయను వేశ్యాంగనను, మీ మోహనాకారమును జూచి చాలా కాలము నుండి నా

మనస్సు మిమ్ముల నాకర్షించెను. ఈ దీనురాలియందు కృపజూడుమని వేడుకొనెను. అందులకు జానకీరాముడు చకితుండయి, ఓ యువతీ! నే నీ జన్మమున నేకపత్నీవ్రతుండను. ఇంటికేగి యతిథి యభ్యాగతుల కోరికలేనిదాసివై బూజింపుచు నెల్లప్పుడు భగవత్సేవ నొనర్చుచు. మోహము వీడి. కామము జయించి, ఇంద్రియముల జయింపుము. నేనుత్తర జన్మమున శ్రీకృష్ణావతారమును ధరించెదను. అప్పుడు నీవు కుబ్జరూపమున మధురాపట్టణమున జనియింతువు అట్టితఱి నీకోరిక దీర్చెదనని చెప్పి పంపెను. నామె శ్రీ కృష్ణావతారమున కుబ్జరూపంబున జనియించి మనోవాంఛా ఫలసిద్ధి నొందెను.

2. పూర్వము మాయాపురి నివాసియు వేదవేదాంగ పారీణుండగు బ్రాహ్మణోత్తముడుండెను. అతనికి మహాసౌందర్యవతియగు గుణవతియను పుత్రికామణి గలదు. గుణపతిని తన శిష్యుండగు చంద్రశర్మ కిచ్చి వివాహం బొనర్చెను. ఒక నాడు దేవశర్మ చంద్రశర్మ లిర్వురు సమిధలకొరకై నడవికేగ,నట, దుష్ట రాక్షసులచే వధియింపబడిరి గుణవతి తండ్రిని, భర్తను గోల్పోయి దుఃఖించుచూ అయోధ్యాపట్టణముజేరి, సరయూతీరమున గ్రహణస్నానార్ధ మరుదెంచిన శ్రీరామ చంద్రుని దర్శించి చరణకమలంబుల వ్రాలెను. శ్రీరాముండామెను గరుణించి వరంబును కోరుమనగా నామె శ్రీరాముని సేవాభాగ్యమును కోరెను, అప్పుడు శ్రీరాముండంత 'దేవీ!' నేనీజన్మమున నేకపత్నీ వ్రతుడను, ఉత్తరజన్మమున శ్రీకృష్ణావతారంబున నవతరింతును అట్టి తఱి నీతండ్రి సత్రాజిత్తుండను నామమున యదువంశమందు జన్మించును. నీవా తనిసుతవై సత్యభామ నామంబున జన్మింతువు. నీ భర్త చంద్రశర్మ యకూ్రరనామంబున జనియించి నాభక్తుండగును. నిన్ను నే వివాహంబాడెద నని చెప్పి యామెను బంపెను.

3. శ్రీరాముం డొకసారి హనుమత్సీతాలక్ష్మణ భరత శత్రుఘ్న సకల వానర, భల్లూక విభీషణాది రాత్రించర సహితముగా పుష్పక విమాన మెక్కి భారతదేశమందలి సింహాచలము, భద్రాచలము, మంగళగిరి, తిరుపతిలో నగు మూడుకోట్ల యేడులక్షల సకల పుణ్యక్షేత్రములకరిగి జగత్కల్యాణం దర్శించి, దక్షిణతీరవాసిని యగు కన్యాకుమారింగాంచి, యామె పూర్వజన్మ పుణ్యంబున నొకవరమును ప్రసాదింపదలచి, వరమునుగోరుమన, నా దేవి దీర్ఘకాలమునుండి శ్రీరాముం బొందగోర కోరిక గలిగియుండుటచే దాసిగా దన్ననుగ్రహింపవేడెను.

అప్పుడు సీతాపతి 'దేవి!' నేనీ జన్మంబుననేక పత్నీ వ్రతుండనై యుంటి భావి కాలంబున శ్రీ కృష్ణావతారమున నవతరింతును. నీవట్టితతి జాంబవతియను నామం బున జనియించి నన్ను వివాహమాడగలవు. అంతదనుక తపం బొనర్చుము. దేహాంతంబున జాంబవంతుని సుతవయి జనియింతువని జెప్పి శ్రీరామచంద్రుండు యథేచ్ఛం జనియె. (ఆనందరామాయణము)

4. శ్రీరామచంద్రుడు మానవమాత్రునివలె నటియింప నిటుల నొనర్చెను గాని యద్దేవదేవు సంకల్పమాత్రమున నసుర సహితముగ లంకాపట్టణమును సముద్రమునందు మునిగియుండెడిది. శ్రీ రామునకు రావణాది దుష్టదానవసంహా రము కర్తవ్యముగా సీతాగ్రహణము ముఖ్యముగాదు. సీతాపహరణ నెపంబున రావణాదుల మడియించెను. లక్ష్మీదేవియే సీతయనియు, విష్ణువే సాక్షాత్తు నీవ నియు బ్రహ్మేంద్రాదులు శ్రీరాము నుతియించిరి. భగవంతుండవతరించు యా పట్టణమే యయోధ్య యనియు, "దేవానాం పూరయోధ్యా" విష్ణుభగవానుండెట నుండునో యయ్యది పరమపదంబనియు, సర్వకర్మ సర్వపాప విధ్వంసకంబగు నా దేవదేవుసేవయే మోక్షంబనియు, శ్రీరాముడు మోక్షదాతయగుటచే నయోధ్యా పురవాసుల కెల్లరకు మోక్షంబిచ్చె ననియు శ్రీరామనామంబు తారకంబనియు, అద్దానిం గైలాసనాథుం డుమాదేవి కుపదేశించెను. శంకరుడనవరతము తారక మంత్రము జపియించును. వారణాసీ పురమున మృతినొందు దేహధారులెల్లరకు నత్యంత కాలమున నుమాపతి తారకోపదేశము చేయుననియు. ప్రాణికోటి తార కోపదేశము చేయబడునపుడు దక్షిణకర్ణం బూర్ధ్వముఖ మగుననియు జ్ఞానులు వచింతురు.

5. శ్రీ కృష్ణ భగవానులు సజ్జనులను బ్రోచి దుర్జనుల శిక్షించి, ధర్మ సంస్థాపన మొనర్చి

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ!
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥.

నే భగవంతుండనియు, అస్మదీయ శరణం బభ్యర్థించు మహాభక్తులకే ననిశము మోక్ష మొసంగుదుననియు లోకంబున జాటెను.

శ్రీరామచంద్రుడు దుష్టశిక్షణ, శిష్టరక్షణ మొనర్చి ధర్మ సంస్థాపన మొనర్చక "ఆత్మానం మానుషం మన్యే" యని నుడువుచు భగవంతుడు వైకుంఠ నగరమున విరాజిల్లుననియు నద్దేవదేవుని భజియించి మోక్షము పొందుం డనియు జాటెను.

శ్రీరామచంద్రుడు నిజావతార రహస్యము గుప్తమొనర్చెను. తాను కేవల మానవు రీతిని వర్తించెను. శ్రీకృష్ణభగవానులు తానే లోకనాథుండనె. తన యవతార రహస్యము లోకమునకు జాటెను. శ్రీరామావతారము పూర్ణావతారము, శ్రీ కృష్ణావతార మంశావతారము.

శ్రీరామ, శ్రీకృష్ణ లీలావతారముల కియ్యదియె యంతరము.

ఓం తత్సత్.

హరే రామ హరేరామ రామ రామ హరేహరే!
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరేహరే!



# శ్రీరామ శ్రీకృష్ణనామ మహిమ:

గీ॥ "కృతయుగంబున ధ్యానంబు, త్రేతయందు
యజ్ఞములు, ద్వాపరంబున నర్చనంబు
గలుగఁ జేయంగఁ గలవొ యే ఫలమునదియె
కలుగు హరికీర్తనంబుచేఁ గలియుగమున."

తా॥ శ్రీపదమగు భగవన్నామమును స్మరించుటవలన కలియుగమున ముక్తినొందవచ్చును.

యజ్ఞములు చేయుటచే త్రేతాయుగమునందును, అర్చనలు సలుపుటచే ద్వాపరయుగమునందును కలుగు ఫలమేమిగలదో ఆ ఫలము హరినామ కీర్తనముచే కలియుగమునందు గలుగును.

క॥ హరిహరియని జపియించిన।
సరగునను సమస్త మంత్రజపఫలమొదవున్
హరినామ జపంబునకున్
సరియైన జపంబులేదు జగములయందున్.

క॥ హరినామ మహామంత్రము
దురితపిశాచమును బారద్రోలును త్రుటిలో
బరమంత్రము లద్దానికి
సరిగా వేవియును నెంతసత్త్వంబున్నన్.

క॥ హరిప్రతిమారూపము ను
దరిసినవాఁడు మిగుల ధన్యుడు హరిపై
సరసమగునట్టి కావ్యము
విరచించినవాడు జన్మవిరహితుడు సుఁడీ.

క॥ హరికంటె హరుని వేరుగఁ
బరికించెడివారు నరకపతితులగుచు దు
ర్భర యాతనలను గుడుతురు
హరిహరులందొకఁడుగూడ నరయుఁడు వారిన్

క॥ హరిపాదాంబువుఁ గ్రోలిన
హరిగుణముల నెంచుకొన్న హరికథ విన్నన్
హరినామము పేర్కొన్నను
హరిఁగన్నను ముక్తి కరతలామలక మగున్.

ఆ॥ వె॥ రామ రామయని విరామంబు లేకుండ
జపముఁ జేసెనని శ్రంపచుఁడేని
పూతుఁడగుచుఁ దాను బూతంబుఁ గావించు
వసుధనెల్ల నిజనివాసముసను.

గీ॥ ఎట్టి యపరాధియైనను నెట్టి హీన
జాతియైనను నెట్టి పాషండుఁడయిన
నశుచియైనను శుచియైన నార్తుడయిన
ధన్యుడగు విష్ణు నామంబుఁదలచె నేని.

గీ॥ బ్రహ్మహత్యాది కోటిపాపములు గూడ
నాశనముజెందు గోవింద నామమునను
భస్మమైపోదె యగ్నిసంపర్కమునను
గ్రావ సన్నిభమగు తూలరాశియైన.

క॥ స్మరియించిన మాత్రముననె
హరినామము నెట్టిమందుడయినను జెందున్
బరిశుద్ధుని బాహ్యాభ్యం
తరములయందును ననారతంబును నిందే.

ఆ॥ వె॥ కృష్ణ కృష్ణ యనుచు గీర్తించువారల
కడకుఁ జేరలేక కలివడంకుఁ
గాన నెట్టి పాపకర్మల కేనియు
దిక్కు కృష్ణనామధేయ మొకటె.

క॥ కరతాళము లొనరించుచు
హరి యెదుటను బాటపాడునట్టి నరుని దు
ర్భర పాతకౌఘ మెల్లను
గరతాడితమైనరీతిఁ గడకున్ బోవున్.

క॥ ఘోరములగు పాపములను
మారణ మొనరించునట్టి మంత్రమన నమో
నారాయణాయ యనియెడి
భారతియొక్కటియె యేల బహుభాషణముల్.

క॥ ఆర్త్రి విష్ణుదశావ తారాహ్వయములు
కీర్తితములైనయెడ సర్వ కిల్బిషములు
జ్వలనమందుంపఁబడిన కాష్ఠములు వోలె
భస్మమైపోయి చేకూరుఁ బరమ పదము.

గీ॥ కృష్ణనామ రసాయనంబెల్ల కడల
దొరకుచుండంగ భవమునఁ దొరగి దాని
మునుగుచుందురు సతతంబు మూఢమతులు
జనన మరణ ప్రవాహోన్మి చయమ్మునందు.

గీ॥ సత్యమును జెప్పుచున్నాఁడ జాటి నేను
సకలపాపములనుగూడ సమయఁజేసి
నరకమునఁ బడనీయక నరుల విష్ణు
ధామమున నిల్పునది హరినామ మొకటె. (ఆం.ప.పు.)

రామ రామ రామ రామ, రామరామ యంచు శ్రీ
రామ రామ రామ రామ-రామ రామ యంచు శ్రీ
రామ రామ రామ రామ, రామ రామ యంచుఁద
న్నాను కీర్తనంబుజేసి, నంగలుంగు మోక్షమున్

శ్లో॥ త్రిషట్కాని చనామాని పఠేద్రామస్య యోనరః
తత్రయోపాధి రహితః మోక్షం సమధిగచ్ఛతి.

అని రామమంత్ర ప్రభావదర్పణ మందుండుట వలన శ్రీరామ శ్రీరామ శ్రీరామ అని పదునెమిది మారులు శ్రీరామ నామస్మరణ చేసెనేని క్రమముగా స్థూల సూక్ష్మకారణోపాధులునశించి ఉపాధిత్రయాతతి పరబ్రహ్మ, మాత్రుడై ఉండునని తెలియము.

శ్రీ పార్వతీదేవికి పరమేశ్వరుడు ఉపదేశించినది. మానవ జన్మ మెత్తి నందుకు సార్థకమును సంపాదించుకొనుడు.

శ్లో॥ శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే।
సహస్రనామ తత్తుల్యం రామ నామ వరాననే॥

ఇందలి ముఖ్యార్థము శ్రీ రామరామరామ శ్రీ ఇహ పరధన బీజము. వర్గ విచక్షణప్రకారము రా2 మ5 రెండును 5చే హెచ్చింపగ రెండైదులు పది. మొదటి రామ పది రెండవ రామకు పది పదులు నూరు, మూడవ రామకు నూరు పదులు వెయ్యిలేక సహస్రము,

సంఖ్యాయోగప్రకారము $2 \times 5 = 10 \times 10 = 100 \times 10 = 1000$ యీవిధము ఆంధ్రవాల్మీకివారి వలన తెల్సుకొన్న మార్గము.

ఓపార్వతీ! ఎన్ని విధముల విచారించినాను మోక్షమును పొందుటకు శ్రీరామ మంత్రజపము కంటె మేలయిన యుక్తి వేఱొక్కటి భూమిలో లేదు. ఇదే నిరపాయమైన యుపాయము అని తెలియును.

నిత్యానంద స్వరూపుడైన పరమశివుడు, ఓ పార్వతీ! నేను "శ్రీరామ! శ్రీరామ! శ్రీరామ! అని జపించుచు ఆ శ్రీరామునియందేదృష్టి కలిగియుండును, ఆ రామ నామమును ఒక్కసారి స్మరించిన విష్ణుకృష్ణాది సహస్రనామముల న్నియు పఠించిన ఫలము గలుగును గనుక ఆ శ్రీరామ మంత్రమును నీ మనస్సున నిలుపుము. అన్ని మంత్రములకంటె శ్రేష్ఠమయిన యీ శ్రీరామమంత్రము బ్రహ్మ–విష్ణు-రుద్ర-మహేశ్వర సదాశివులనెడు పంచకర్తలసృష్టికర్తల సృష్టి, స్థితి, లయ, తిరోధాన అనుగ్రహములకు ముఖ్యకారణమును, సర్వాతిశయమును, అయిన తారకబ్రహ్మమును, తెలియజేయునదియును, పవిత్రమైన వస్తువులతో మిగుల పవిత్రమైనదియును, తనమహిమను సంతోషించినవారికి ధర్మ కామ మోక్షముల నిచ్చునదియును నైయున్నదని కూటస్థుని కంటె వేఱుగాని పరమాత్మయందు బ్రహ్మ విష్ణు రుద్ర వ్యాస వసిష్టాది బ్రహ్మవేత్తల మనస్సులు ఎల్లప్పుడును లీనమయి యుండుటచేత ప్రకృత్యతీతమయిన ఆ పరబ్రహ్మ మునకు రామనామము గలిగెను.

శ్రీరాముడను పేరుగలవాడు అహం శబ్ద (నేను) లక్ష్యార్థ పరబ్రహ్మ మయిన శ్రీమన్నారాయణ మూర్తియే సుమీ! ఆ శ్రీమన్నారాయణమూర్తికిని నాకును భేదము లేనేలేదు. మేము "ఏకమే వాద్వితీయం బ్రహ్మ" అను శ్రుత్యర్థమువలన రెండవది లేని పరమాత్మ స్వరూపులము గనుక అద్వయ బ్రహ్మ మయుడైన నాయందే నేను క్రీడించుచుందును. ఓంకారమునకు లక్ష్యార్థమును మహాపరిశుద్ధమును అయిన శ్రీరామమంత్రము ఎంతటి పాపమునైనను నశింప జేయును. శ్రీరామనామ మహిమను పొగడ నాకు శక్యముగాదు. పదునాల్గు లోకములలో శ్రీరామ మంత్రముచేత నశింపజేయబడని మహాపాపము వెదకిచూచు నను లేదని శ్రీ సాంబమూర్తి పలికెను. మరియు శ్రీరామమంత్రము కోరిన కోరి కలసన్నిటిని భక్తులకు హెచ్చుగ నిచ్చుచుండగా కల్పవృక్షమును కామధేనువును చింతామణియును చూచి చిన్నపోయి సిగ్గుపడుచుండును. ఈ సంగతి మూఢు లెఱుంగక భంగపడి అంగలార్చుచు ఆ శ్రీరాముని పవిత్ర చరిత్రములను విను చుండెడి బుద్ధిశీలురు అష్టభోగములు మొదలగు వానిని పొంది సుఖించుచుందురు

ఈ శరీరమునకు నవద్వారములున్నవి. ఈ ద్వారము లన్నింటినుండియు నపవిత్రమయినవే వచ్చుచున్నవి. బొగ్గు నెంతగా నఱుగఁ దీసినను దెలుపురాదు గదా ? అటులనే శరీరమునకు లోపల వెలుపల నంతయు నపవిత్రమే. కొండమీది నుండి జలధార ప్రవహించునట్లు శరీరమునుండి కఫము, మలము, మూత్రము మొదలగునవి ప్రవహించుచుండును. ఎల్లయపవిత్ర పదార్థములకు నిధియైనది దేహము. మలకుంభమువలె నుండును. తన మూత్రము తన మలముతాను దాకినచో నసహ్యపడి వెంటనే మట్టి మున్నగు వానిచే శుద్ధి చేసికొనును. అత్తరువు, పన్నీరు పూసికొని తృప్తిపడును. అంతమాత్రమున నాయపవిత్రత పోవునా ? నల్లని జంతువున కెన్నిచేసినను దెల్లదనిము రానట్లే ఏన్ని పర్యాయములు కడిగిన నీ దేహమునకుఁ బావిత్రమురాదు. అపవిత్రమే. ముక్కులనుండి చెవులనుండియు మలములే స్రవించుచుండును. లోనుండి బయటకు వచ్చునవియన్నియు మలినములే కాని శుభ్రమైన వేవియులేవు. అట్టి మలములకు నిలయమైన శరీరమని యెఱింగియు మాయచ్రక్కియున్న వాడగుటచే మానవుడు వైరాగ్యమునుబొందుట లేదు. అభిమానమును బెంచుకొనుచున్నాడు. దేహమందలి. దుర్గంధమునుజూచి, మలమునుజూచి రోతపడునేగాని వైరాగ్యమునందఁడు.

దేహముకంటె రోతయగునదీ ప్రపంచంలో నింకేదియుఁ గనిపించుటలేదు. మట్టితో నెన్నిసార్లు కడిగినను బరిశుద్ధము కాదు జ్ఞానమనెడి యుదకముతో నంతఃకరణమును గడుగవలెను. అప్పుడు పవిత్రుడు, శుద్ధుడగును. ఇట్టి భోగసాధన మనెడి భావమును వీడి ముక్తిసాధన మగునదియను భావము నందవలెను. అప్పుడు జ్ఞానియై సంసార సాగరమునుఁ దరించి ముక్తిని బొందును. అరటి చట్టునకు బొరలవలె దేనికది తీసివేసినచో నిస్సార మీశరీరము. అనేక అనక జన్మములలోఁ జేసిన పాపకర్మముల వలన దనకుదాను ద్రోహనిమొనర్చికొను బుద్ధి గలుగుచున్నది. "మమేతి పరమం దుఃఖం నమమేతి పరం సుఖం" మమ కార (నాదియను భావము) ముండుటయే మహాదుఃఖము. మమకారము లేకపోవుటయే పరమ సుఖము. కొందఱు చక్రవర్తులు మహారాజులు హరిశ్చంద్రుడు, నలుడు, పురుకుత్సుడు, పురూరవుడు, సగరచక్రవర్తి, కార్తవీర్యార్జునుడు, జనకమహారాజు మొదలగువారు తాము భోగముల కొఱకు బుట్టలేదని తలంచి రాజ్యాదులందు మమకారము లేనివారై తరించిరి.

గర్భములో నున్నపుడు జీవునకు వైరాగ్యము కలుగును. కాని భూమి మీద బడుసరికి మోహమావరించి పూర్వజ్ఞానమంతయు బోవును. భూమిపై బుట్టగనే గత జన్మల స్మృతియుండదు. అందుచే నీ దేహముపై ప్రేమ బయలు దేరును. తనకు దరణోపాయ మేదియో తెలిసికొనక మానవుడు మోహమునబడి సంచరించుచుండును. గర్భములో గల్గిన జ్ఞానమును నాతని పాపకర్మ నిలువ కుండజేయును, పరమేశ్వరుడు చక్కగా ధర్మార్థ కామమోక్షములు గలుగు మార్గమును దెలుపుచుండగా దానిని వినని వానిగతి యథోగతియే. యౌవనము గడచి వార్థక్యము వచ్చినచో నంతయు దుఃఖమే. శరీరమంతయు ముడుతలు పడును. చేతులు, కాళ్ళు నాడవు. ఏపనిజేయుటకు శక్తి యుండదు. అప్పుడైనను వైరాగ్యము కలుగదు. భార్య. కుమారులు. మనుమలు విసుగుకొని తిట్టు చుందురు.

ఆ దశలో దానధర్మములు గూడ జేయలేడు. తన యాస్తి, ధనము, సర్వము కుమారుల యాధీనములో నుండును. తాను జేయవలెననుకొన్నను గుమారులు చేయనీయరు. ఆ ప్రాయమున ధర్మమునుగాని, యర్థమునుగాని, కామమునుగాని, మోక్షమునుగాని. సాధింపలేడు. అందుచే శరీరము దృఢముగ నుండగనే తరించు సాధనమును జేసికోవలెను.

## శరీర మెవరిది ?

మానవు డీ దేహము నాది, నే నందముగ నున్నాను. నా కాయా భోగ ములు కావలయును, అని భ్రాంతి నొందును. అసలీ దేహ మెవ్వరిది. ఈ దేహము తనను గన్నతల్లిదా ? పెండ్లి చేసికొనిన పిదప భార్యను సౌఖ్య పెట్టవలెనని తలంచునుగదా ! అందుచే నీ దేహము భార్యదా ? తన్ను రాజ్యాధినేత పోషించు చున్నాడు. ప్రభువు నిలువుమనిన నిలువవలెను. కూర్చుండమనిన గూర్చుండ వలెను. అందుచేత నీ దేహ మా రాజ్యాధినేతదా ? మరణించిన పిదప నగ్నిలో బడవైచి కాల్చివేయుదురు. గాన నగ్నిహోత్రునిదా ? కొందఱు మరణించిన వారిని భూమిలో గప్పియుంతురు. క్రిమికీటకాదులు దేహమును దినివేయును. అందుచే వాటిదా యీదేహము. ఇట్లు అపరిశుభ్రమై తుదకేమియు గాకపోవునట్టి యీ శరీరమును జూచి మోహపడును. దీనిపై నాతని కేమియు స్వాతంత్ర్యము లేదు. నశించిపోవునట్టిది. అట్టి దీనిపై నెందులకింత భ్రాంతి ? ఈ దేహము పితృ

మాతృ శుక్ర శోణిత సముదాయమువలన గలిగిన నీచ శరీరముపై నింత భ్రాంతి యెందులకు ? ఇది యొక నీటిబుడగ వంటిది. ఈ దేహము దృఢముగా నున్నపుడే భగవత్సేవ, భగవన్నామ స్మరణ చేసికొని ముక్తి సాధనము నొనరించుకొనవలెను.

శరీర మారోగ్యముగ నున్నపుడే వార్ధక్యమునకు దూరముగ నున్నపుడే యింద్రియపటుత్వ మున్నపుడే యాయువు క్షీణింపనప్పుడే తన తరుణోపాయమునకుఁ దాను బుద్ధిమంతుడు ప్రయత్నము చేసికోవలయునుగాని యెప్పుడో జ్ఞానము సంపాదించవచ్చుననుట యిల్లంటుకొనిన పిదప నూతిని త్రవ్వ నారంభించుట యగును. (దీపముండగనే యిల్లు చక్కబెట్టుకొనవలయును). శరీరము లనిత్యములు భోగము లశాశ్వతములు. నిత్యము మనవెంట మృత్యువుత గిలియుండును. కావున నీ యుత్తమ శరీరముండగనే ధర్మసంపాదనము జేయవలయును.

చిత్తము క్షణికమైనది. విత్తము చంచలమైనది. మన జీవితములు నశాశ్వతములైనవి. యమునికి గరుణ శూన్యము, కావున ధర్మమును ద్వరగా నాచరింపవలెను.

కావున నీ మానవుడు దార్ఢ్యముగ నున్నప్పుడే భగవంతుని పూజించుట, భగవత్కథలు వినుట, చదువుట, భగవంతుని నామము స్మరించుట, యథాశక్తిగా దానధర్మము లొనరించుట, అన్నదానము జేయుట, తీర్థయాత్రలు చేయుట, సత్పురుషులతో సాంగత్యము నొందుటవలన దరింపగలడు. అట్లాగావింపనిచో నధోగతి పాలగును.

ఈ కలియుగములో నామస్మరణ పూర్వకమగు భక్తి నాచరించవలెను. చెప్పనలవిగాని పాపము లెన్నియైనను విష్ణుమంత్ర జపమువలన నశించును. జయశీలుడగు విష్ణునామమును సర్వదా జపింపవలెను. జయశీలుడగు విష్ణు నామమును సర్వదా జపింపవలెను. సర్వము మిథ్యయని తెలుసుకొని విష్ణునామమును సర్వదా పఠించి జపించువాడు సర్వపాపములనుండి విడువబడి విష్ణులోకమును బొందుచున్నాడు. మానవుడు నిత్యము విష్ణు నామమగు 'హరి' యను రెండక్షరములు జిహ్వతో బలుకునో ఆ నామోచ్చారణ మాత్రమున ముక్తిని బొందుచున్నాడు. సందేహము లేదు. తపస్సు ప్రాయశ్చిత్తములకంటే రామ, కృష్ణ నామస్మరణమే గొప్పది.

త్రికాలములందును రాత్రియందు నామస్మరణ చేసినచో సర్వపాపము లును బోయి విష్ణులోకమునందును, విష్ణుమంత్ర జపమువలననే స్వర్గాది సుఖము లను గూడ బొందును. ఇది ముమ్మాటికిని సత్యము.

రామ రామ రామ రామ యను నష్టాక్షరీ మంత్రము నిరంతర మెవ్వడు జపముచేయునో వాడు చండాలుడైనను దరించును. పవిత్రుడగును. ఎంతమాత్రమును సందేహము లేదు. కాశి, గయ, ద్వారక మున్నగు తీర్థముల సేవించిన ఫలము లభించును. కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ యని యెవ్వరు జపించి పఠించుచున్నారో వా రిహలోకము విడిచి విష్ణు సాన్నిధ్యమున నానందించు చున్నారు. రామ యనియు, రామభద్రయనియు. రామచంద్ర యనియు నెవ్వడు నిత్యము జపించునో వాడు సర్వపాప విముక్తుడై శాశ్వత ముక్తిని బొందును. అని వశిష్ఠ మహర్షి జెప్పెను.

ఏ మానవుడు "నారాయణ" యను భగవన్నామము నొకసారి స్మరించునో వాడు మూడువందల కల్పములు గంగాది సర్వతీర్థములయందును స్నాన మొనర్చిన ఫలము నొందును.

నారములనగా నుదకము, నీరునుండి యుత్పన్నమగుటచే నీటిని నారము లనిరి. నరుడన పురుసోత్తముడు నారములు మొదటి నివాసస్థలముగా గలవాడగుట చేనాతనిని నారాయణుఁడనిరి.

నారాయణ యను పదమొక తీఁగ, దానికి నా, రా, య, ణ యను నాల్గక్షరములు నాల్గుచిగుళ్ళు. ధర్మార్థకామమోక్షములే యాతీగ యొసంగుపండ్లు, సంశయము లేదు. భోజనసమయమున ప్రతికబళమునకును గోవిందనామ సంకీర్తనము గావించువాఁడు నిత్యోపవాసి, ఆతడు నిస్సంశయముగ జీవన్ముక్తుడు. మరణ సమీపకాలమందు మూడు పర్యాయములు "శివ, శివ, శివ" యని స్మరించుచు శరీరమును విడుచువానికి మొదటి 'శివ' పదమే సంసార పాశమును ద్రెంప సమర్థమైనది. తక్కినరెండు పదములను దానము చేయవలసిన పనిలేక మిగిలి యున్నది.

మిక్కిలి యల్పముగా జేయుదానమైన నతిస్వల్పమగు జపమైన నత్యల్ప

మగు హోమదానమైన ననంతఫలప్రదమగుటచేతను ఐతిసేవవలన స్త్రీలు తరించుటచేతను గలియుగ సాధువనబడుచుండును.

శ్లో॥ హరే రామ హరే రామ రామ రామ హరే హరే ।
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరేహరే ॥

హరేరామ హరేరామ మొదలగు ఐదియారు నామములుగల మంత్రము కలికాలము నందొనర్చు పాపములను నశింపజేయును.

ఇంతకన్న నుత్కృష్టమగు నుపాయము సర్వవేదములు పరిశీలించినను గన్పిందని కలి సంతరణోపనిషత్తు వెల్లడించుచున్నది.

మానవుడు కలియుగములో దరించుటకు రెండు మార్గములు చెప్పబడినవి. (1నామస్మరణ. 2) పురాణములు వినుట నామమాహాత్మ్యము సర్వమునుబురాణముసందున్నది. కావున బురాణములు వినవలెను. పూర్వమందు బుట్టినవియు భూత భవిష్యద్విషయములను జెప్పునవియు, పూర్వయుగము లందలి విషయములను దెల్పునవియును, నవ్యనవ్యములై మానవ హృదయముల నాకర్షించునవియును పురాణములనియు పలువురు నిర్వహించినారు. కాన పురాణములు వినవలెను.

శ్లో॥ విష్ణుం నారాయణం కృష్ణం మాధవం మధుసూదనం
హరిం నరిహరిః రామం గోవిందం దధివామవమ్.

తా1 విష్ణు, నారాయణ. కృష్ణ. మాధవ, మధుసూధవ హరి నరహరి, రామ, గోవింద, దధివామన అనుపది నామములను భక్తియుక్తులై స్మరించి తరించండి (బ్రహ్మవైవర్తము)

ఓం తత్సత్

శ్లో॥ ఇతి షోడశకం నామ్నాం కలికల్మష నాశనమ్
నాతః పరతరోపాయ సర్వవేదేషు దృశ్యతే॥

# మంత్రపుష్పము - భావము

1. ఓమ్ సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశ్వశమ్భువమ్

'ఓం అనేక శిరములుకలది. అనేక నేత్రములుగలది. సర్వమునకు సుఖము కల్గించునది, సమస్తమయినది.

2. విశ్వ నారాయణం దేవమక్షరం పరమం పదమ్।

దివ్యరూపము నరుల సముదాయమందు నుండునది, నాశము లేనిది, పరమ పదమైనది. (ఆ స్థానమే యన్నిటి పైదని అర్థము)

3. విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్।

అన్నిటిమీది దానికంటె మీదిది. నిత్యమైనది, నారాయణుండని, హరియని సర్వమును వ్యాపించియున్నది.

4. విశ్వమే వేదం పురుషస్త ద్విశ్వము పజీవతి ।

ఈ కనపడుచున్న ప్రపంచమంతయును ఆపురుషుని స్వరూపమే. దాని నాశ్రయించియే ప్రపంచము జీవించుచున్నది.

5. పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతిగ్ం శివమచ్యుతం ।

విశ్వమునకు దానధిపతి, తనకుదానే యధికారి. శాశ్వతము; మంగళ కరము. నాశములేనిది, అందరి నరులలోను ఉండునది.

6. నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణం ।

గొప్పగా తెలియదగియున్నది. ప్రపంచమున కంతటికిని ఆత్మ (జీవాత్మ) రూపమైయున్నది అదే పరమగతియై యున్నది.

7. నారాయణ పరోజ్యోతిరాత్మా నారాయణః పరః ।

నరులలోనున్న యా ఆత్మయె ఎక్కువయిన తేజస్సు అదేపరమాత్మ

8. నారాయణ పరబ్రహ్మ తత్త్వం నారాయణః పరః ।

నారాయణుడే పరబ్రహ్మ, నారాయణుడే పరతత్త్వము.

9. నారాయణ పరోధ్యాతా ధ్యానం నారాయణ పరః ।

ఇట్లు ధ్యానించువాఁడు నరుఁడగు నారాయణుఁడే ఆధ్యానమును ఉత్కృష్టదయిన ఆ నారాయణుడే. (ధ్యానముచేయునాఁడు, అధ్యానము, ధ్యానము చేయబడువాఁడు సర్వము నారాయణుడే. అదే పరమాత్మ, అదే పరతత్త్వము)

10. యచ్చకిఞ్చి జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయ తేపివా।

మనకుం గనంబడుచున్న మనము వినుచున్న ప్రపంచమేది కలదో అదంతయు మరియు మనము చూడనిది విననిది యగు ప్రపంచ మంతయూ గూడను.

11. అ న్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణ స్థితః ।

లోపలనున్నది బయటనున్నది, ఆ సర్వప్రపంచమును నాది నారాయణుడున్నాడు.

12. అనంత మవ్యయం కవిగ్ం సముద్రే న్తం విశ్వశమ్భువమ్ ।

అంతములేనిది, నాశములేనిది, సర్వముఁ దెలిసినది, ఆకాశమందంతము గలది, (అనగా సముద్రమంటే ఆకాశము ఆకాశ మెక్కడ నంతమగునో అచటనే దీని కంతము, ఆకాశమునకు అంతములేదు. దీనికిని అంతము లేదు.) ప్రపంచమునకు సుఖముకలిగించును. (ఇట్లు పరమాత్మను జెప్పి జీవాత్మను అదియుండుస్థానము వర్ణించుచున్నాడు.)

13. పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యధో ముఖం ।

తామరమొగ్గ ఆకారముగా నధోముఖమై వ్రేళ్లాడుచు

14. అధోనిష్ట్యా వితస్త్యాన్తే నాభ్యా ముపరి తిష్ఠతి ।
బొడ్డుకు పంద్రెండంగుళాల మీదికి (ఒక వస్తువు) వున్నది.

15. జ్వాలమాలాకులం భాతి విశ్వస్యాయ తనం మహత్ ।
అగ్నిమంటలతో నిండి సమస్త ప్రపంచమున కాధారమయినచోటది,

16. సన్తతగ్ం శిరాభిస్తులమ్బత్యాకోశ సన్నిభం ।
ఎల్లప్పుడు రక్తనాడులకు వ్రేలాడుచుండును. ఇంచుక మొగ్గవలెనుండును. (అనగా జివరను గొంత సందున్నదని తాత్పర్యము)

17. తస్యాన్తే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్సర్వం ప్రతిష్ఠితం ।
ఆ మొగ్గ చివరను చిన్న రంధ్రముకలదు. ఆ చిరవ నంతయు గలదు. (దాని లోపల గొప్ప యగ్నికలదు.)

18. తస్యమధ్యే మహానగ్నిర్వి శ్వార్చిర్విశ్వతో ముఖః సోఽగ్రి
భుగ్వి భజన్తి షన్నాహార మజరః కవిః ।

దాని లోపల గొప్ప యగ్నికలదు. ఎటుచూచినను దానిలో మంటలు కలవు. అన్ని ముఖములను ఆ మంటలు వ్యాపించును. ఆ యగ్నియే ఆహారమును మొదట తినువాడు. (ఆ తినిన యాహారమును అన్నిటికిని పంచుచుండును.)

19. తిర్య గూర్ధ్వ మధశ్శాయీ రశ్మయ స్తస్య సన్తతా
సన్తాపయతి స్వందేహ మాపాద తలమ స్తగః ।

ఆ యగ్నికి ముదిమియే లేదు. అన్నీ తెలిసినది, దానికి కిరణములు అడ్డుగాను, నిలువుగాను, క్రిందుగాను. ఉండి ప్రసరించుచున్నవి.

20. తస్యమధ్యేపహ్ని శిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః ।
దాని మధ్యను సన్ననిదై మీదికి ప్రసరించుచు అగ్నిశిఖ అనగా అగ్ని జ్వాల కలదు.

21. నీలతో యదమధ్యస్థాద్వి ద్యుల్లేఖేవ భాస్వరా ।

నల్లని మేఘముమధ్యను మెరుపుతీగవలె ప్రకాశించుచు.

22. నీ వార శూక వత్తన్వీ పీతా భాస్వ త్య ణూపమా ।

వరిముల్లు ఎంత సన్ననిదో అంత సన్ననిదై పసుపుపచ్చరంగు గలిగి అణుమాత్రమె చక్కగా (ఆహారమును) తినుచున్నది.

23. తస్యా శ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః

ఆ యగ్నిజ్వాల మధ్యను (అనగా నీ చెప్పినదవతము జీవ విషయము ఆ జీవునిలోనే అని తాత్పర్యము) పరమాత్మయున్నది.

24. సబ్రహ్మ సశి వస్స హరి స్సేన్ద్ర స్సోఽక్షరః పరమస్స్వరాట్।

అదే బ్రహ్మ, అదేహరి, ఆదేఇంద్రుడు, అదే అక్షర (నాశములేని) పర బ్రహ్మము, స్వరాట్టు.

25 ఓం తద్బ్రహ్మ।

అదేబ్రహ్మ

26. ఓం తద్వాయుః।

అదే వాయువు

27. ఓం తదాత్మా।

అదే ఆత్మ

28. ఓం తత్సత్యం।

అదే సత్యము

29. ఓం తత్పురోర్నమః।

అదే స్వరము, అదేముందు గనంబడునది

30. అన్తశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు।

అది అన్ని భూతముల (జంతువుల) యందును లోపల సంచరించును. సకల శరీరములందును గుహలోనుండును. (గుహయనగా నెవెవరకు జెప్పిన తామర మొగ్గ మధ్యనున్న అవకాశము. అది అంగుష్ఠమాత్ర ముండును. దానివే దహరాకాశమందురు.)

31. త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వ మింద్రస్త్వగ్ం
రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మత్వం ప్రజాపతి॥

నీవే యజ్ఞరూపుడవు. నీవే వషట్ అని ఉచ్చరించిచేసిన హోమస్వరూపు డవు. నీవే ఇంద్రుడవు, నీవే రుద్రుడవు, నీవే విష్ణువు, బ్రహ్మవు నీవే, ప్రజాపతివి నీవే.

32. త్వం తదాప ఆపోజ్యోతీరసోఽమృతంబ్రహ్మభూర్భువస్సువరోమ్
నీవే యుదకము. ఉదకములోని తేజస్సు అనగా విద్యుత్తునీవే. అందు నున్న రుచి నీవే, అమృతము నీవే, నీవే బ్రహ్మ సమస్తలోకములును నీవే.

ఓం, సహనావవతు, సహనౌభునక్తు
సహవీర్యం కరవావహైతేజస్వినా
వధీతమస్తు, మావిద్విషావహై.

ఓం తత్సత్

1. స్వస్తి ప్రజాభ్యః
ప్రజలకు శుభము కలుగుగాక !

2. పరిపాలయన్తాం న్యాయేన మార్గేణ మహింమహీశాః
తా॥ న్యాయమగు పద్ధతులలో మంత్రులు, రాజులు ప్రజలను పాలింతు రుగాక

3. గోబ్రాహ్మణేభ్యః శుభమస్తునిత్యం

తా॥ గోవులకును బ్రాహ్మణులకును శుభమగుగాక !

4. లోకాస్సమస్తా స్సుఖినోభవన్తు.

తా॥ సమస్త ప్రపంచమును సుఖాబ్ధి నోలలాడుగాక !

1. కాయేన వాచా మనసేంద్రియైర్వా

తా॥ శరీరముతోగాని, మాటలతోగాని, మనస్సుతోగాని, మఱియు నేయితర యింద్రియములుగాని లేక

2. బుద్ధ్యాత్మనావా ప్రకృతే స్వభావాత్

తా॥ బుద్ధితోగాని, ఆత్మసాక్షిగాగాని, ప్రకృతిస్వభావము ననుసరించిగాని,

3. కరోమి యద్యత్ సకలం

తా॥ ఏఏ పనులు చేతునో వాటి నన్నింటిని

4. పరస్మై

తా॥ పరాత్పరుడగు

5. న్నారాయణాయేతి

తా॥ నారాయణునకు

6. సమర్పయామి.

తా॥ సమర్పించుచున్నాను,

ఓం శాంతిః శ్శాంతిః శ్శాంతిః

ఓం = ప్రణవ ప్రతిపాదితమగు బ్రహ్మము మాయందనుగ్రహించుగాక !

శాంతిః = ఆధ్యాత్మిక తాపశాంతి యగుగాక !

శాంతిః = భౌతిక తాప శాంతి యగుగాక !

శాంతిః = ఆది దైవిక తాపశాంతి యగుగాక !



## భక్తులకు సూచన

భక్తాగ్రేసరులారా !

భగవంతుఁడు పరమాత్ముండగుటచే నిజసుతాదులగు జీవాత్మలను దరచు యాగ్రహించి,

శ్లో॥ తానహంద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్
క్షిపామ్యజస్ర మశుభానాసురీష్వేవయోనిషు॥

భగ. 16అ. 19 శ్లో.

ద్వేషించు పాపాత్ములు క్రూరకర్ములగు నరాధముల నసురయోనిం ద్రోయుదు "నక్షమామివ వసుంధరే" యని కోపారుణిత లోచనుండయి పలుక మహాభక్తులు భగవతికి మొఱలిడి రక్షింపమని వేడగ నద్దేవియు బెక్కురీతుల నతి వినయంబున నద్దేవదేవునికిం దెల్పి శాంతచిత్తునొనర్చి వారల రక్షింపజేయును.

కావున శ్రీ సీతారాముల, శ్రీ రుక్మిణీ కృష్ణుల, శ్రీ లక్ష్మీ నారాయణుల, శ్రీ పార్వతీ పరమేశ్వరుల నొకటిగా బూజింపవలయునుగాని వేరొనర్పరాదు.

అనగా సీతాసమేత శ్రీరాముని, రుక్మిణీసమేత శ్రీకృష్ణుని, లక్ష్మీసమేత శ్రీమన్నారాయణుని, పార్వతీసమేత శ్రీ పరమేశ్వరుని బూజింపవలయును. భగవతిని నెట్టితరియును బూజింపరాదు. బాలకృష్ణుని నొక్కనిగా బూజింపదగును.

జానకీరహిత దాశరథిం బూజించువారలు శూర్పణఖవలెను, శ్రీరామరహిత సీతం బూజించు భక్తులు దశవదనుంమాడ్కిం జెడుదురు.

ఓం తత్సత్

## ఫలశ్రుతి—మంగళాచరణము

విజయ కామ్యసిద్ధి, విజ్ఞాన ఫలవృద్ధి
జ్ఞానబుద్ధి, సర్వసారలీల
మేలు "రామకృష్ణ లీలాతరంగిణి"
గూర్పుగాత భక్తకోటి కెపుడు

శ్లో॥ మంగళమ్ కోసలేంద్రాయ
మహనీయ గుణాత్మనే
చక్రవర్తి తనూజాయ
సార్వభౌమాయ మంగళమ్ ॥

శ్రీ రామ శ్రీకృష్ణార్పణమస్తు
ఓం శాంతి శ్శాంతిః శ్శాంతిః



# శ్రీ రామకృష్ణ లీలాతరంగిణి గ్రంథముద్రణకు తోడ్పడిన వదాన్యులు

## మహారాజ పోషకులు



శ్రీయుత సగ్గం సదానందంగారు
శ్రీమతి సగ్గం సత్తెమ్మగారు,
కారవాన్ ఇం. నెం. 13-6-727/1, హైదరాబాదు.



శ్రీ గోపిశెట్టి నర్సయ్యగారు
Retd. Elec. E. O. Department
ధూల్‌పేట, జాలిహనుమాన్ ఆలంఘరీ, 13-2-292/6.


శ్రీ. శే. దామ విఠలయ్యగారు

వారి స్మృత్యర్థ్యము—వారి కుమారులు

1) శ్రీ దామ కోటయ్యగారు,
ప్రిన్సిపాల్, గవర్నమెంటు
టి.టి.ఐ., నేరేడుమెట్ట.

2) శ్రీ దామ రాములుగారు,
శానిటరీ సూపర్‌వైజరు,
మ్యునిసిపల్ కార్పొరేషను,
హైదరాబాదు.



శ్రీయుత దేవర రాజమల్లయ్యగారు,
వారి సతీమణి శ్రీమతి మల్లమ్మగారున్నూ,
వారి కుమారులు శ్రీ దేవర రాజలింగం,
మల్లేశ్వర్, రాజేశ్వర్, సీతారాం, మాణిక్యంగార్లు
కారవాన్, ఇం.నెం. 13-6-32, హైదరాబాద్-267,

శ్రీమతి అండ్ శ్రీ బి. శ్రీనివాస్‌గారు
కంట్రాక్టర్, ఇం.నెం. 13–6–242/1, కారవాన్‌సాహూ

శ్రీ సామల వేంకటయ్య గారు
శ్రీ వేంకటేశ్వర కలర్ కంపెనీ, పాన్‌బజార్, సికిందరాబాదు.

---

## రాజపోషకులు



1. శ్రీమతి అండ్ శ్రీ సగ్గం సౌభాగ్యలక్ష్మి దత్తాత్రేయులు గార్లు
c/o శ్రీ సగ్గం దత్తాత్రేయ అండ్ బ్రదర్స్
క్లాత్ మర్చంట్స్ - కారవాన్ 13-6-727 హైదరాబాదు

2. శ్రీమతి అండ్ శ్రీ సగ్గం వసంతా శ్రీనివాసులు గార్లు
c/o శ్రీ సగ్గం శ్రీనివాస్ అండ్ బ్రదర్స్
స్టీల్, ఇత్తడి అండ్ అల్యూమినియం
కార్వాన్ 13-6-727/1 హైదరాబాదు.



3. శ్రీమతి అండ్ శ్రీ బరాడి సుమిత్రాబాయి సత్యనారాయణ గార్లు
3-6-1006, కారవాన్ - హైదరాబాదు.



4. శ్రీ కాసుల నారాయణరావుగారు ఆర్గనైజరు, గవర్నమెంటు
కమ్యూనిటీ డెవలప్‌మెంటు సెంటరు — గుడిమల్కాపురం
హైదరాబాదు-28.



5. శ్రీమతి అండ్ శ్రీ చెన్న కమలమ్మా వాసుదేవరావుగార్లు
c/o శ్రీ చెన్న వాసుదేవరావు టింబర్ మర్చంట్ గోషామహల్
కార్వాన్, సాహూ హైదరాబాదు.

6. శ్రీ కరి శేషాచలంగారు మరియు వారి కుమారులు
పాండురంగారావుగారు 12-2-417/55, శారదానగర్, హైదరాబాదు.



7. కీ.శే. కందూరి రామనాథంగుప్తగారి స్మృత్యర్థం వారి
కుమారులు శ్రీ కందూరి సోదరులు 13-4-798
కార్వాన్—హైదరాబాదు.

# పోషకులు-ఎ



1. శ్రీ డాక్టర్ ఎ.పాండురంగంగారు రిజిష్టర్డు మెడికల్ ప్రాక్టీషనరు.
బాలాజీ క్లినిక్ 14-2-518. మోజాంషాహి-
గోషామహల్-హైదరాబాదు.

2. శ్రీ పెదపూడి కృష్ణమాచార్యులు గారు
(Elec Board) శారదానగరు- 21 హైదరాబాదు.

3. శ్రీ జి. గోపాల్ అండ్ బ్రదర్స్ కిరాణా, ఫ్యాన్సీ అండ్ రైస్
కార్వాన్-హైదరాబాదు.

4. శ్రీ జి. జ్ఞానేశ్వర్ గారు, బియ్యం వ్యాపారము, 13-6-5
కారవాన్ సాహూ-హైదరాబాదు 267.

5. శ్రీ బాలాంజనేయ దేవాలయ కమిటీ చిలుకలగూడవారు.

6. శ్రీ దోడ రాజేశ్వరరావుగారు, కార్వాన్ 13-6-672.

7. శ్రీ కామధేను టెక్సు ప్రింట్సు, 1-7-389/1
బాకారం-హైదరాబాదు-48.

8. శ్రీ పి. వి. మనోహర్‌గారు, S.B.H; 12-2-417/55
శారదనగర్ కాలనీ హైదరాబాదు-267.

9. శ్రీ యం. నన్జుండశర్మగారు
నెం. టి/44 ప్లాస్సిలైన్సు, బొవిన్‌పల్లీ, సికిందరాబాదు-11.

10. కీ.శే. రాయసం లింగరాజుగారి జ్ఞాపకార్థం-వారి కుమారులు
డాక్టర్ ఆర్. రామారావుగారు

11. శ్రీ రాఘవేంద్ర టెక్సుటైల్సు
ప్రొ॥ శ్రీ చింతకాని భిక్షపతిగారు, క్లాత్ మర్చంట్సు, కారవాన్ 13-6-8

12. శ్రీ గుండా ఈశ్వరయ్యగారు
పాన్‌బజారు, సికింద్రాబాదు.

13. శ్రీ విస్సంశెట్టి యాదగిరిగారు
పాన్‌బజారు, 19-128, సికింద్రాబాద్.

14. శ్రీ విస్సంశెట్టి అయోధ్యారాములుగారు
పాన్‌బజారు, 19-128, సికింద్రాబాదు.

15. మమతా మెడికలు హాలు
కారవాన్, హైదరాబాదు.

16. శ్రీ కొండోజు బ్రహ్మానందంగారు
నిత్యానందనిలయం, 11-4-321, చిలుకలగూడ. సికింద్రాబాద్-61

17. శ్రీ చెన్న విఠల్‌గారు
కీ.శే. అనంతయ్యగారి పుత్రుడు 13-6-742, కార్వాన్, హైదరాబాదు.

18. శ్రీ కరన్‌సింగ్‌గారు
13-6-379, రామసింగ్‌పుర, కారవాన్, హైదరాబాదు

19. శ్రీ చింతల ఈశ్వరయ్యగారు
కిరాణా అండ్ జనరలు స్టోర్, 13-6-14, కారవాన్, హైదరాబాదు.

20. శ్రీ జి.ఆర్. టైలరు ప్రొ॥ శ్రీ గౌర రాములుగారు
కారవాన్, 13-5-95, హైదరాబాదు-267.

21. శ్రీ విఠల్‌రావుగారు
c/o జ్ఞాన్‌కమల్ కిడ్డీస్ గార్మెంట్సు, నాంపల్లి
మున్సిపల్ విశ్రాంతిభవనము

22. శ్రీ. శే. హనుమాన్‌దాస్‌గారి స్మృత్యర్థము వారి సోదరులు
శారదానగరు, హైదరాబాదు-23.



23. శ్రీ సంకూరి రామచంద్రయ్యగారు
కారువాన్‌సాహూ, 13-4-761, హైదరాబాద్.

24. శ్రీ ఆర్. గోపాలరావుగారు మరియు వారి కుమారులు ఆర్.వి. శర్మగారు
12-2-417/35, శారదానగరు, హైదరాబాదు.

25. కుంచం నారాయణగారు
చేవేళ్ళ (పి.చో)

# పోషకులు-బి

## హైదరాబాదు

1) శ్రీ మద్దాల రామచంద్రరావుగారు, 15, శారదానగరు.

2) శ్రీ ఆవుల భూషన్‌రావుగారు, సంతోషి ఆయిల్ షాపు, ఇం. నెం. 13-6_502, తాళ్ళగడ్డ, కార్వాన్

3) శ్రీ ఐ. రాఘవేంద్రరావుగారు 12-2-417/5-శారదానగరు

4) శ్రీ మల్లె అంజయ్యగారు, కార్వాన్. జియాగూడ.

5) శ్రీ ఎ.ఆర్. కృష్ణగారు, కంట్రాక్టరు, 13-6-148/1, కార్వాన్‌సాహు

6) శ్రీ పి. జగన్‌మోహన్‌రావుగారు, ఎల్.ఐ.సి. కాలనీ, 12-2-417/ఎ/8

7) శ్రీ వేదాంతం (ఉషాకాంత్ 12-2-417/ఎ/27 ఎల్. ఐ. సి. కాలనీ. జయానగర్, గుడిమల్కాపురం

8) శ్రీ వేమూరి పాండురంగ విఠల్‌గారు, శారదానగర్ 22/ఎ

9) శ్రీ వి. రామచంద్రయ్యగారు, కార్వాన్‌సాహూ, 13-4-758

10) శ్రీ డి. బలరామ్‌గారు, కారవాన్,కుల్సుమ్‌పూర్, 13-6-613/4

11) శ్రీ వి. రాజవిఠల్‌గారు, 14 2-54, చందన్‌వాడి, గోషామహల్.

12) శ్రీ కె. రామకృష్ణగారు. శారదానగరు-88

13) శ్రీ జె. వేంకటమాణిక్యంరావుగారు, రామసింగపుర, 13-6-410.

14) శ్రీ శివయ్య మాస్టర్‌గారు తాళ్ళగడ్డ, 13-2-481/3, కారవాన్.

15) శ్రీ జి.యస్. విఠల్‌గారు, శారదానగరు-34

16) శ్రీ ఆయిల్ డిపో, మెహదీపట్టణం

17) శ్రీ దట్ల మాణయ్య గుప్తగారు, షాపు నెం. 13-6-990 కార్వాన్

18) శ్రీ బామిని పెంటయ్యగారు. బస్తేపురం, చనువెళ్ళి (పి.ఒ) చేవేళ్ళ

19) శ్రీ చెన్న లక్ష్మయ్యగారు, అల్లాడ_గుండాల (పి.ఒ), చేవేళ్ళ తాలూకా

20) శ్రీ షరాపు వీరయ్యగారు, వేంకటాపురం (పి.ఒ), చేవేళ్ళ తాలూకా.

21) శ్రీ బామిని తులశయ్యగారు, బస్తేపురం, చనువెళ్ళి (పి.ఒ).

22) శ్రీ గోపు నర్సింలుగారు, తాళ్ళపల్లి, చేవేళ్ళ (పి.ఒ)

23) శ్రీ భోగ ఆంజనేయులుగారు, మాడిపల్లి. (వ్యాపారం)

24) శ్రీ వి. కొండయ్యగారు, కార్వాన్, కేరాఫ్ : S. దత్తాత్రేయులుగారు

25) శ్రీ బాస నరసింహులుగారు. క్లాత్ మర్చంట్సు, కార్వాన్.

26) శ్రీ యం. జగ్గయ్యగారు, క్లాత్ మర్చంట్సు, సిద్ధలూర్ బజార్

27) కుల్సుమ్‌పురా పోస్టు ఆఫీస్ స్టాఫ్,

28) శ్రీ నారాయణ్‌దాస్‌గారు, 13-5-361, కిరసిన్ ఆయిలు అండ్ కిరాణా మర్చంటు, కారవాన్.

29) శ్రీ యస్. తుకారాం బాలాజీగారు కిరాణామర్చంట్, 13-6-892 కార్వాన్

30) శ్రీ పి. రామారావుగారు, 30-12-81, శారదానగరు-39

31) శ్రీ టి. డి. కృష్ణమూర్తిగారు, శారదానగరు-39.

32) శ్రీ పి.వి వి.జి. కృష్ణమూర్తిగారు, సీనియర్ రిపోర్టర్, ఇంటలిజెన్సు, లకడీకాపూల్.

33) శ్రీ డి.కె. విశ్వనాథరావుగారు, సప్తగిరి, 12-2-417/6, శారదానగర్

34) శ్రీ పి.వి.జి.వి. ప్రభాకరరావుగారు, 58-శారదానగరు

35) శ్రీ ఎ. జ్ఞానప్రకాష్‌గారు, తాళ్ళగడ్డ, 13-6-578, కారవాన్‌సాహూ

36) శ్రీ వర్కాల పండరిగారు, 13-6-743/3/ఎ కారవాన్.

వదాన్యులు



శ్రీయుత డా॥ రాయసం రామారావు గారు

వారి సతీమణి

శ్రీమతి రాయసం హనుమాయమ్మ గారు

కారవాన్ – కుల్సుమ్‌పుర – హైదరాబాదు - 500 267.

పదాన్యులు



శ్రీయుత చింతల ఈశ్వరయ్య గారు

వారి సతీమణి

శ్రీమతి చింతల సక్కుబాయి గారు

13-6-14 కారవాన్-హైదరాబాదు-500 267.

37) శ్రీ ఎ. సుకుమార్‌గారు వారి సోదరులు శ్రీ శివలాల్‌గారు వెజిటేరియన్ షాపు, మెహిదీపట్టణము.

38) శ్రీ చిలగాని వీరన్నగారు, చాగల్లు తాలూకా, ఘణపురం.

39) శ్రీయుత కాడిగె నారాయణగారు కారవాన్ 13-4-757/1

40) శ్రీ జి. అంజయ్యగారు కారవాన్.

41) శ్రీ ఓంకారి నర్సింగంగారు ముస్తందపురం 13-2-174

42) శ్రీ తోట వీరయ్యగారు c/o శ్రీ వెంకటేశ్వర స్టీల్‌స్టోర్సు 15-8-77, పీల్కానా

43) శ్రీ చలువాది యాదయ్యగారు c/o వేంకటేశ్వర స్టీల్‌స్టోర్సు 15-8-77 పీల్కానా

44) శ్రీ గుజ్జం చంద్రయ్యగారు 13-4-795/1 కార్వాన్

45) శ్రీ టి. రాఘవరెడ్డిగారు 10-3-282|2/ఏ/15 వేంకటాద్రినగర్‌కాలనీ

46) శ్రీ కూచన సత్యనారాయణగారు - లాలాపేట

47) శ్రీ సి.హెచ్. వేంకటయ్యగారు 122709/89 నవోదయ కాలనీ

48) ది వరల్డ్‌టీచర్ ట్రస్టు హైదరాబాదు బ్రాంచి 12-2-417/ఏ/8, గుడిమల్కాపురం, జయనగర్ ఎల్.ఐ.సి. కాలనీ

49) శ్రీ పి.సి.సి. గుప్తగారు 4-2-66 సుల్తాన్‌బజార్

50) శ్రీమతి అండ్ శ్రీ భజరంగం ప్రసాద్, కవారీగారు 22-4-287 ఆలీజా కోట్ల

51) శ్రీమతి అండ్ శ్రీ మన్నవ లీలావతారంగారు 10-3-14/5 హుమాయూన్‌నగర్

52) శ్రీమతి అండ్ శ్రీ నర్వ అంజయ్యసాగర్ 13-6-156/1 కార్వాన్

53) శ్రీమతి అండ్ శ్రీ బాలయ్యసాగర్ 13-6-333 కార్వాన్

54) కీ.శే. నర్వ భాషయ్య లక్ష్మమ్మగార్ల జ్ఞాపకార్థము వారి కుమారుడు నర్వ శ్రీనివాసులుగారు 13-6-556 కార్వాన్ తాళ్ళగడ్డ

55) STUDIO IMAGE Excellent Cinema slides in dia - tone & Process colors Quality Designing Commercial Photography & Advertisement Layouts Near S. D. Hospital Mehdipatnam Road, Hyderabad-500 028.

56) శ్రీ కమట్ాల రామకృష్ణగారు 8-1-245 శివాజీనగరు సికింద్రాబాదు-3

57) శ్రీ ఎస్. నరసింహన్‌గారు న్యూ 'సి' 14, కెమికల్స్‌కాలనీ మెట్టూర్ డామ్-636407 సాలెమ్ జిల్లా, తమిళనాడు స్టేట్

58) శ్రీ కుందుర్తి రామకృష్ణగారు అటెండరు తిరుమల తిరుపతి దేవస్థానములు "హిందూధర్మ రక్షణసంస్థ శ్రీ బాపూజీ మార్కెట్ కాంప్లెక్సు గ్రౌండ్సు (పాత నేషనల్ టొబాకో కంపెనీ) ఒంగోలు ప్రకాశంజిల్లా.

59) శ్రీ టి. కామరాజుగారు, శారదానగరు-46/20

60) శ్రీ వనమా సత్యనారాయణగారు, శారదానగరు-60

61) శ్రీ గజం రామలక్ష్మయ్యగారు సరస్వతీకాలనీ 20/65 H.Y D -659

భగవానుడు వీరికి ఆయు రారోగ్యైశ్వర్యములు
కలిగించుచూ ఇట్టి సత్కార్యములకు
బుద్ధిని ప్రసరింప జేయునట్లు
ఆశీర్వదించుగాత! సర్వేజనాః
సుఖినో భవన్తు

వదాన్యులు

శ్రీ చివుకుల ఈశ్వరార్య ప్రభుదేశికేంద్రులవారి

ప్రియశిష్యులు మరియు అచల గురుపీఠాధ్యక్షులు



శ్రీ గురు

# కరుణానంద గుండా ఈశ్వరార్య రాజయోగిగారు

శ్లో॥ శ్రీ ఈశ్వరార్య ప్రభుదేశి కేంద్రకారణం
శ్రీ గుండా వంశాంబుధి పూర్ణసోమం
శ్రీ పూర్ణబోధ పరతత్వ పరమ ప్రకాశకం
శ్రీ గురుకరుణానంద ఈశ్వరార్య గురుంభజే

వదాన్యులు

శ్రీ నిత్యానంద కొండోజు శీతయార్య

దే శి కేం ద్రు ల వా రి

ప్రియశిష్యులు మరియు అచల గురుపీఠ కార్యదర్శులు



# శ్రీ నిత్య నిర్గుణానంద కొండోజు బ్రహ్మానందంగారు

శ్లో॥ శ్రీ సనాతన గోత్రకలశాంబుధి పూర్ణచంద్రం
శ్రీ సీతయాచార్యగురు పాదారవిందం సుపుత్రంచ
శ్రీ విశ్వకర్మ కులదీపకం । నిత్యనిర్గుణానంద
శ్రీ కొండోజు బ్రహ్మానందం । సద్గురు భజామ్యహం